

"ఆపదల్లో వున్న ఆత్మీయుల్ని ఆదుకునే వారు" "ఆదుకున్న వార్ని ఆదరించే వారు"
"తను కన్‌ఫ్యూజై అందర్నీ కన్‌ఫ్యూజ్ చేసే వారు"
"తను ప్రేమించిన యువతిని పెళ్ళాడలేక జీవితంలో సుఖపడలేని వ్యక్తి"
"తను ప్రేమించిన పడతిని పొందుటకై కోతలు కోసే వారు"
"ప్రేమకు అంతస్థులు లేవనే పడతులు" "పై మెరుగులు కోసం ప్రాకులాడే ఆడపిల్లలు"
"భర్త అనురాగాన్ని నోచుకోలేని యువతులు" డబ్బు కోసం నానాగడ్డి తినే వారు"

తెలుగు జీవితంలో జీవితంగా పాత్రలో పాత్రగా
సంలీనమయ్యే కథతో కూడిన చిత్రం.





శ్రీ సారథీ స్టూడియోస్ వారి

# ఆత్మీయులు

సంగీతం: రాజేశ్వరరావు * దర్శకత్వం: వి. మధుసూదనరావు * ఫొటోగ్రఫీ: సెల్వరాజ్

నిర్మాత: దుక్కిపాటి మధుసూదనరావు బి.ఏ

నవయుగ

NVKR

# సవ్యమైన పెంపకానికి రక్తి
# బోర్న్‌విటా శక్తి !



ఎదిగే వయసులోని చదువుకొనే పిల్లలకు రోజువారీ భోజనంవలన చేకూరే శక్తి చాలదు. వారికి కలిగే శక్తి అంతా చదువుల్లో ఆటలల్లో హరింపు అయిపోతుంది. పిల్లల సవ్యమైన పెంపకానికి సరియైన పోషణకు అధిక శక్తి చాలా అవసరం. తగిన శక్తిని సమకూర్చేందుకు వారికి ప్రతిరోజూ బోర్న్‌విటా ఇవ్వాలి. బోర్న్‌విటాతో పిల్లలు ఆరోగ్యంగా ఉత్సాహంగా ఉండగలరు. రుచికరమై శక్తి పోషకమైన బోర్న్‌విటా కోకో, పాలు, మాల్ట్, పంచదారల సంతులిత మిశ్రమము, మరి దీనిని తయారు చేసేవారు — క్యాడ్‌బరిస్




**శక్తి, ఉత్సాహం మరియు రుచికోసం-క్యాడ్‌బరీస్ బోర్న్‌విటా!**

# ఫోస్‌ఫోమిన్



శక్తిని పెంపొందించును.



ఆకలిని అధికము చేయును.

సహనశక్తిని పెంపొందించును.



శరీరముయొక్క

రోగనిరోధక శక్తిని ఎక్కువ చేయును.

అవును —

కుటుంబము అంతటికి ఫోస్‌ఫోమిన్
వల్ల ఆరోగ్యము కలుగును.

ఫోస్‌ఫోమిన్...బి కాంప్లెక్స్ విటమినులు మల్టిపల్
గ్లిసరోఫోస్‌ఫేట్లుగల అకుపచ్చని పండ్ల రుచిగల టానిక్




SQUIBB

® ఇ. ఆర్. స్క్విబ్ & సన్స్ ఇన్‌కార్పొరేటెడ్ వారి
రిజిష్టర్డ్ ట్రేడ్‌మార్కుకు చిహ్నం: దీని లైసెన్సు
ఉపయోగదారులు కరంచంద్ ప్రేంచంద్ ప్రయివేట్ లిమిటెడ్

SARABHAI CHEMICALS

Shilpi SC 50 A/67 Tel



# SENSATIONAL AND BIG NEWS OF THE YEAR

## రూ. 5 లక్షలు

**టిక్కెట్టు ఒక రూపాయి మాత్రమే**

ఆంధ్రప్రదేశ్

గౌరవ కార్యదర్శి:
థాకూర్ వి. హరిప్రసాద్
స్పెషల్ హనరరీ ఫస్టుక్లాస్ మెజిస్ట్రేట్

పబ్లిసిటి కమిటీ
ఎ. కృష్ణస్వామి అయ్యంగార్,
ప్రభుత్వ స్పెషల్

బహుమతుల వివరములు

| | | | |
|---|---|---|---|
| మొదటి బహుమతి | — | 1 | |
| రెండవ బహుమతులు | — | 2 | ఒక్కొక్కటి |
| మూడవ బహుమతులు | — | 3 | ఒక్కొక్కటి |
| నాల్గవ బహుమతులు | — | 10 | ఒక్కొక్కటి |
| ఐదవ బహుమతులు | — | 40 | ఒక్కొక్కటి |
| ఆరవ బహుమతులు | — | 100 | ఒక్కొక్కటి |
| ఏడవ బహుమతులు | — | 200 | ఒక్కొక్కటి |

మొత్తం 356 బహుమతులు

ఎక్కువ టిక్కెట్లు అమ్మినవారికి బహుమతులు:—మొదటి బహుమతి: రూ. 2,500.
టిక్కెట్లు జంటనగరాలలోని సూపర్‌బజారులలోను, మరియు ఆంధ్రప్రదేశ్‌లోని అన్ని జిల్లాకలెక్టర్లవద్దను
ఏజంట్లు టిక్కెట్ల వెల ముందుగా చెల్లించి గౌరవకార్యదర్శి, ఆంధ్రప్రదేశ్ వెల్‌ఫేర్ ఫండ్,
గ్రామ్సు: "WELFARE"

అభ్యుదయము - పురోగమనము -



కోతలు, బరుకులు,
బొబ్బలు మొదలైన వాటిమీద
మందు కలిగిన
బ్యాండ్-ఎయిడ్*
బ్రాండ్
డ్రెస్సింగ్‌లను
అంటించండి.






BAND-AID Dressings
BAND-AID DRESSINGS












# చందమామ

సంచాలకుడు: 'చక్రపాణి'

ఈ నెల ప్రచురితమవుతున్న బేతాళ కథ ["నిత్యయౌవనం"] అన్న కథలో మంచి నీతి ఉన్నది. ఈ కథలో ఉపేంద్రుడు అనే కమ్మరియువకుడు స్వార్థపరుడుగా పైకి కనిపిస్తాడు. కాని అతను చాలా వివేకం గలవాడు. అతను ఇలను ప్రేమించీ పెళ్ళాడలేదు, అందం చూసీ పెళ్ళాడలేదు; ఆమె తనను ప్రేమించిందని పెళ్ళాడాడు. ఆమె అందం అపూర్వ శక్తి వల్ల కలిగిందని తెలిసి, ఆ అందాన్ని కోల్పోవటానికి కూడా సిద్ధపడ్డాడు. అతనిది వాస్తవిక దృష్టి.

సంపుటి 45 ఆగస్టు '69 సంచిక 2










# ఊరగాయ దొంగ

ఒక గ్రామంలో ఒక బడిపంతులు వుండేవాడు. ఆయన గ్రామంలోని పిల్లలందరికీ చదువు చెప్పేవాడు. గ్రామస్థులు తమకు తోచినది తృణమో, పణమో ఇస్తూనే వుండేవారు. కాని దానితో పంతులు దరిద్రం తీరేదికాదు. ఎందుకంటే ఆయనకు గర్భదారిద్ర్యంతోబాటు గంపెడు పిల్లలు.

ఆ ఊరి కరణం కాస్త కలిగినవాడు. బడిపంతులుకు ఎన్నో విధాల సహాయం చెయ్యగలవాడే గాని, కొంచెం కాపీసం మనిషి కావటంచేత నోటిమాటలతో మాత్రమే సానుభూతి చూపేవాడు కరణంగారి తల్లి ఎనభై ఏళ్ళ తొత్తుక. ఆవిడ కాపీనం వర్ణనాతీతం.

ఒక ఏడు కరణంగారింట రెండు జాడీల నిండా ఆవకాయ పెట్టుకున్నారు. బడిపంతులు చిన్న గిన్నెడు ఊరగాయ అయినా పెట్టలేకపోయాడు. ఒక జాడీడు ఆవకాయ అయినా వుంటే ఇంటిల్లిపాతికీ కొంతకాలం పాటు అన్నానికి ఆధరువు దొరుకుతుంది.

అందుచేత పంతులు కరణంగారి ఊరగాయ కాజెయ్యాలని నిశ్చయించాడు. ఒక రోజు దీపాలుపెట్టేవేళ కరణంగారింటికి వెళ్ళి, అదీ ఇదీ మాట్లాడి, అందరూ పనుల మీద ఉన్న సమయంలో, వెళ్ళివస్తానని కేకపెట్టి, వంటఇంట్లోకి వెళ్ళి ఊరగాయ జాడీ ఎత్తుకుని, దొడ్డితోవన చీకట్లో పడి తన ఇంటికి వచ్చేశాడు.

మర్నాడు పొద్దుటి దాకా కరణంగారింటి వాళ్ళు ఊరగాయ దొంగతనం మాట తెలుసుకోలేదు. ఎవరెత్తుకుపోయి వుంటారా అని కరణంగారు అనుకుంటూ ఉంటే, ఆయన భార్య, "ఇంకెవరు? ఆ దరిద్రుడు పంతులే అయి ఉంటాడు. నిన్న చీకటిపడేవేళ వచ్చాడు. ఆ తరవాత మనింటికి ఎవరూ రాలేదు," అన్నది.

వి. అనంతరావు



"ఛీ, ఛీ! పాపం, పంతులు దొంగ తనం చెయ్యడు," అన్నాడు కరణంగారు.

"ఎందుకు చెయ్యడు? దరిద్రం ఏమైనా చేయిస్తుంది. నువు వెంటనే గ్రామాధికారితో చెప్పి పంతులు ఇల్లు సోదా చేయించు. పోయిన జాడీ దొరక్కపోతే అప్పుడడుగు," అన్నది కరణం తల్లి.

కరణం అలాటి పనికి సమ్మతించలేదు. ఒకవేళ పంతులు ఇంట జాడీ దొరికినా తనకు ఊళ్ళో మర్యాద పోతుంది. "కరణం గారే నన్ను ఊరగాయ పట్టుకుపొమ్మన్నారు," అని పంతులు అన్నపక్షంలో అందరూ నమ్ముతారు. ఎందుచేతనంటే, పంతులంటే తనకు ఎంతో అభిమానం ఉన్నట్టు ఊరంతకీ కరణం కనబరుస్తూ వస్తున్నాడు.

"పంతులు ఇల్లు సోదా చేయించటం పరువు నష్టం. ఊరగాయ జాడీ పోతే పోయిందిలే!" అన్నాడు కరణం.

"అదేంమాట? ఇవాళ ఇదయింది, రేపింకొకటి అవుతుంది. ఈ దొంగతనం ఏదోవిధంగా రుజువుచెయ్యాలిసిందే. నేనొక ఉపాయం చెబుతాను. మనం నెలరోజుల పాటు తీర్థయాత్రల మీద పోతున్నామని చెప్పి, మన భోషాణం పంతులింట ఉంచు.



ఆ భోషాణంలో నేను కూర్చుంటా. నువు సాయంత్రం వచ్చి, ప్రయాణం మాను కున్నామని చెప్పి, భోషాణాన్ని మళ్ళీ ఇంటికి తీసుకురా. ఈలోపల నేను వాళ్ళ దొంగతనం ఆరాతీస్తా," అన్నది కరణం గారి తల్లి.

కరణానికి ఇదంత బాగాలేకపోయినా విధిలేక ఒప్పుకున్నాడు. తల్లికి సొంత ఆస్తి చాలా ఉన్నది. అదంతా తన పిల్లలకే దక్కాలన్న ఆశతో కరణం ఆవిడమాట బాగా సాగనిస్తూ ఉండేవాడు.

మర్నాడు ఉదయం కరణం బడిపంతులును పిలిపించి, "పంతులూ, మేం తీర్థ



యాత్రలకు బయలుదేరుతున్నాం. మా వెండి బంగారాలు భోషాణంలో పెట్టి ఒక నెలరోజులపాటు మీ ఇంట్లో ఉంచుతాం. అభ్యంతరం లేదుగద?" అన్నాడు.

"మహరాజుగా ఉంచండి," అన్నాడు పంతులు.

ముసలిదాన్ని భోషాణంలో ఉంచి, భోషాణాన్ని పంతులు ఇంటికి మోయించుకొచ్చి, కరణం వెళ్ళిపోయాడు. తినటానికని ముసలిది మినపరొట్టె తెచ్చుకున్నది.

మిట్టమధ్యాహ్నంవేళ పంతులు పిల్లలు, "అమ్మా, అన్నంపెట్టు," అన్నారు. భోషాణంలో ఉన్న ముసలిది మినపరొట్టె తీసి తినసాగింది. ముసలిదానికి పళ్ళులేవు. రొట్టె దిగమింగటానికి నీళ్ళులేవు. అందుచేత రొట్టెను నోటిలో కొంతసేపు ఉంచుకుని నానినాక తిందామని ముసలిది ప్రయత్నం చేస్తున్నది.

ఇంతలో పిల్లలు, "అమ్మా, కరణం గారి ఆవకాయ వెయ్యవూ?" అని కేకలు పెట్టసాగారు.

ఆ మాటలు విన్న ఉద్రేకంలో, "దొరికార్రా దొంగముండాకొడుకుల్లారా!" అనుకుని ఆవేశం తెచ్చుకుని, కరణంగారి తల్లి తన నోట్లో ఉన్న రొట్టెముక్కను గొంతులోకి పోనిచ్చింది. అది కాస్తా గొంతుకు అడ్డం పడింది. ముసలి దానికి ఊపిరందక కొద్ది సేపట్లోనే చచ్చి పోయింది.

ఆ సాయంకాలం కరణంగారు పంతులు ఇంటికి మనుషులను పంపాడు. వాళ్ళు వచ్చి పంతులుతో, "కరణంగారు ప్రయాణం మానుకున్నారుట. భోషాణం తెమ్మన్నారు," అన్నారు. పంతులు పట్టుకు పొమ్మన్నాడు.

ఇంటికి చేరిన భోషాణం తలుపు తీసి చూస్తే ముసలిది చచ్చి కొయ్యబారిపోయి కనిపించింది.

కరణం కంగారుపడి పంతులుకు కబురు చేశాడు. ప్రతిదానికీ పంతులు సలహా తీసుకో

వటం ఆయనకు అలవాటే. పంతులు వచ్చాక, "చూడు, పంతులూ. మా అమ్మ అకస్మాతుగా చచ్చిపోయింది. ఒక రోగమూ రొష్టూ అయినా లేదు. ఈ సంగతి ఊళ్ళో తెలిస్తే, ఆవిడ డబ్బు కోసం నేనే చంపా నంటారు. ఈ శవం మాయంచేసే ఉపాయం ఏదన్నా నువ్వే చూసి నా పరువు కాపాడాలి. మూడో కంటి వాడికి తెలియ గూడదు," అన్నాడు.

"మీరు డబ్బుకు వెనకాడకుండా ఉంటే అంతా సరి అవుతుంది. మీరేమీ భయపడ కండి," అన్నాడు పంతులు.

కరణానికి ధైర్యం వచ్చింది. ఒక వంద రూపాయలు పంతులు చేతులో పెట్టాడు. పంతులు ముసలిదాని శవాన్ని భుజాన వేసుకుని పైన గుడ్డ కప్పి, ఊరికి దూరంగా ఉన్న ఏట్లో పారేద్దామని బయలుదేరాడు.

పొరుగూరి జమీందారుగారు ఎక్కడి నుంచో పొద్దుపోయి తన గుర్రపు బండిమీద స్వగ్రామానికి పోతూ పంతులు నడిచే రహదారి వెంట వస్తున్నాడు.

పంతులు కంగారు పడ్డట్టు ఇటూ అటూ పరిగెత్తి, గుర్రపు బండీ దగ్గిరికి వచ్చాక, ముసలి దాన్ని గుర్రాల ముందు జారవిడిచాడు.

బండీ ఆగి పోయింది. జమీందారు బండి దిగాడు.

"అయ్యో, అమ్మా! నీకప్పుడే నూరేళ్ళూ నిండాయా?" అంటూ పంతులు శవం మీది గుడ్డ తీసి శోకాలు ప్రారంభించాడు.

"ఏమయ్యా, అంత అవివేకమా? బండీని తప్పుకోవటం కూడా చాతకాదా? ఇంద ఈ డబ్బు ఉంచు," అంటూ జమీందారు పంతులుకు డబ్బు సంచీ ఇచ్చి, బండీ ఎక్కి ముందుకు సాగిపోయాడు.

తరవాత పంతులు కరణం తల్లి శవాన్ని ఏటికి తీసుకుపోయి, ప్రవాహంలో పారేసి, అర్ధరాత్రి కల్లా ఇల్లు చేరుకున్నాడు.





# నక్కతీర్పు

తాతయ్య మామిడిపళ్ళు తెచ్చాడు. అమ్మ వాటిని కోసి, ముక్కలు పిల్లలకు పంచింది. తనకు చిన్న ముక్క వచ్చిందని ఒకరూ, టెంక కావాలని మరొకరూ, ఇలా పిల్లలు పేచీలు పడసాగారు.

"ఏమర్రా, మీకు కొంచెం కూడా బుద్ధి లేదే! మీ కన్న ఆ కథలో నీటిపిల్లులు నయం గదరా!" అన్నాడు తాతయ్య.

పిల్లలు మామిడిముక్కల గొడవ మరిచి పోయి తాతయ్య చుట్టూ చేరి, "ఏం కథ తాతయ్యా? నీటిపిల్లులు మా కన్న ఎందుకు నయం, తాతయ్యా?" అని ప్రశ్నలు వేశారు.

"అవతలి వాళ్ళకు ఎక్కువ పోయిందని మీరు దిగులు పడ్డారు. అవతలి వాళ్ళకు తక్కువ పోతుందేమోనని అవి దిగులు పడ్డాయి. అదే తేడా మీకూ, వాటికీ," అన్నాడు తాతయ్య.

"నీటిపిల్లులు మామిడిపళ్ళు పంచుకున్నయ్యా, తాతయ్యా? — నువ్వు చెప్పేది అర్థం కావటం లేదు. కథ పూర్తిగా చెప్పు, తాతయ్యా," అని పిల్లలు తాతయ్యను వేధించారు.

"అయితే గొడవపెట్టకుండా, బుద్ధిగా కూచుని, వినండి," అంటూ తాతయ్య ఆరంభించాడు:

టిబెట్టు అని ఒక దేశం ఉంది. ఆ దేశంలో ఒక నది ఉంది. ఆ నది ఒడ్డున రెండు నీటిపిల్లులు నివసించేవి. అవి ఎంతో స్నేహంగా ఉంటూ, అవసరమైనప్పుడల్లా ఒకదాని కొకటి సహాయం చేసుకుంటూ ఉండేవి.

నదిలో చేపలుంటాయిగద. అవి నీటిపిల్లులకు ముఖ్యమైన ఆహారం. నీటిపిల్లి చేపను ఎలా పడుతుందంటే, నదిలోకి దిగి, చేపలను వెన్నంటి ఈదుతూ పోయి, వాటిని

ఒడ్డు కేసి తరుముతుంది. ఒడ్డున పడ్డ చేపను తినేస్తుంది.

కాని చేపలను పట్టుకుని ఇంటికి తీసుకు పోవాలంటే కష్టం. ఎందుచేతనంటే, నీటి పిల్లి ఒక చేపను ఒడ్డుకు తరిమి ఇంకో చేప కోసం వెళ్ళేసరికి మొదటి చేప ఎగిరి మళ్ళీ నీటిలోకి దూకి తప్పించుకు పోతుంది. ప్రతి చేప కోసమూ నీటిపిల్లి ఒడ్డు కెక్కి, దాన్ని చంపి, తిరిగి నీటిలోకి దిగాలంటే చాలా కష్టం.

ఈ బాధ నీటిపిల్లులకు రెంటికీ కలిగింది. అందుచేత అవి ఏం చేశాయంటే, రెండూ కలిసి చేపలను పట్టుకుందామనుకున్నాయి. చేపలను ఒడ్డుకు తరమటం ఒక నీటిపిల్లి పని, ఒడ్డున పడ్డ చేపను చంపటం రెండో నీటిపిల్లి పని. ఇలా నీటిపిల్లులు, ఒకటి నీటిలోనూ, ఒకటి ఒడ్డునా పని చేసి బోలెడన్ని చేపలను పట్టుకోగలిగాయి. ఇక వాటిని రెండు నీటిపిల్లులూ పంచుకోవటమే తరవాయి.

"అన్నా, చేపలను రెండు కుప్పలు చెయ్యి," అన్నది ఒడ్డున పని చేసిన నీటిపిల్లి.

నీటిలో పని చేసిన నీటిపిల్లి చేపలను విభజించటానికి సంకోచించింది. తాను పొర



పాటున రెండో దానికి తక్కువ భాగం ఇచ్చి అన్యాయం చేస్తానేమోనని దాని భయం. అందుచేత అది రెండో నీటిపిల్లితో, "అన్నా, నువే పంచు!" అన్నది. దానికీ అదేభయం.

రెండు నీటిపిల్లులూ ఒకరి నొకరు అన్యాయం చేసుకుంటామేమోనన్న భయంతో ఏమీ చెయ్యక, చేపలను మధ్య పెట్టుకుని దిగులుగా కూర్చున్నాయి.

ఇంతలో అటుగా ముఖరు డనే నక్క వచ్చి, చేపలను చూసింది. దానికి పొద్దుటి నుంచీ, అరణ్యంలో ఎంత వెతికినా ఆహారం దొరకలేదు. ఆకలితో అది నకనక

లాడుతున్నది. అది తనలో, "అబ్బో, ఎన్ని చేపలో!" అనుకుని, నీటిపిల్లులతో, "ఏమర్రా, అల్లుళ్ళూ, అలా విచారంగా ఉన్నారేం?" అని అడిగింది.

"ఈ చేపలను పట్టాం. కాని వీటిని పంచుకోవటంలో ఒకరి కొకరం అన్యాయం చేస్తామేమోనని భయపడుతున్నాం," అన్నాయి నీటిపిల్లులు.

"మీకీ చేపలను న్యాయంగా నేను పంచనా?" అన్నది నక్క.

నీటిపిల్లులు తమకు వచ్చిన చిక్కు తొలిగిపోతుందనుకుని, సరేనన్నాయి.

నక్క ఒక నీటిపిల్లిని అవతలికి తీసుకుపోయి, "చేపలను పట్టటంలో నువు నిజానికి చేసిందేమిటి? అంతా రెండో నీటిపిల్లే చేసింది. అది నీటిలోకి వెళ్ళి, ప్రవాహానికి తట్టుకుంటూ, చేపలను ఒడ్డుకు ఎంతో నేర్పుగా తరిమింది. ఒడ్డున పడ్డ చేపలను చంపటం తప్ప నువ్వేమీ చెయ్యలేదు. న్యాయంగా నీకు రావలిసిన వాటా చాలా కొద్ది," అన్నది.

తరవాత నక్క రెండో నీటిపిల్లిని ఎడంగా తీసుకుపోయి, "కష్టమంతా రెండో నీటిపిల్లి పడింది. ఒడ్డున రాళ్ళూ, రప్పలూ, దుబ్బులూ, గుంటలూ, మిట్టలూనూ. నువు సునాయాసంగా చేపలను ఒడ్డుకు తరిమితే, అవి మళ్ళీ నీటిలోకి దూకేలోపల పరిగెత్తుతూ వచ్చి, వాటిని పట్టి చంపి, చేపలన్నిటినీ దక్కించింది," అన్నది.

ఈ మాటలు విని రెండు నీటిపిల్లులూ అవమానంతో కుంగిపోయాయి.

తరవాత నక్క చేపలన్నిటికీ తలలూ, తోకలూ కత్తిరించి, నీటిలో పని చేసిన నీటిపిల్లికి తలలూ, ఒడ్డున పని చేసిన నీటిపిల్లికి తోకలూ ఇచ్చి, మధ్యవర్తిత్వం చేసినందుకు తన ఫీజు కింద చేపల మధ్య భాగాలు పుచ్చుకుని, ఇంటికి చక్కాపోయింది.






## 20

[శిఖిముఖీ, విక్రమకేసరీ యిద్దరు అనుచరులతో బ్రహ్మపుత్రానదీ లోయలకు బయలు దేరారు. వాళ్ళు కామాఖ్యనగరం చేరి ఒక సత్రంలో విడిది చేశారు. వాళ్ళు లేని సమయంలో పూజారి వాళ్ళుండే మిద్దె మీది గదిలో ప్రవేశించాడు. శిఖిముఖి అతణ్ణి పట్టుకోవాలని ప్రయత్నిస్తే, పిట్టగోడ దూకి గుర్రం మీద పారిపోసాగాడు. తరవాత—]

సత్రం ముందు పెద్ద కలకలం రేగింది. ఇద్దరు హడావిడిగా గుర్రాల మీద పారిపోతూండటం, కత్తులు దూసిన యువకు లిద్దరు 'ఆగండి!' అంటూ వాళ్ళకేసి పరిగెత్తుతూండటం చూసి, సత్రంలో విడిది చేసినవాళ్ళు చాలామంది ఆవరణలోకి పరిగెత్తుకొచ్చారు. అజితుడూ, వీరభద్రుడూ వేగంగా పూజారీవాళ్ళ వెనక కొంతదూరం పరిగెత్తారు. కాని, గుర్రాల మీద పారిపోతున్న అతణ్ణీ, సవరభేరుండాన్నీ పట్టుకోవటం వాళ్ళకు సాధ్యమయేపని కాదు.

శిఖిముఖీ, విక్రమకేసరీ తమ గది తలుపు బంధించి మిద్దె మీది నుంచి కిందికి దిగి వచ్చారు. ఆ సరికి అజిత వీరభద్రులు రొప్పుతూ వాళ్ళ దగ్గిరకు వచ్చి, పూజారి దొరకలేదని చెప్పారు. ఆ దుర్మార్గుణ్ణి చేజిక్కించుకునే అవకాశం కొద్దిలో విఫలమైనందుకు శిఖిముఖి విచారపడ్డాడు.



అంత ఎత్తు మిద్దె మీది నుంచి పూజారి కిందికి దూకుతాడని అతడు అనుమానించలేకపోయాడు. సవరభేరుండం కింద కాచుకుని వున్న సంగతి అతడికి తెలియదు.

"శిఖీ! ఈ దుర్మార్గుడి బెడద మనకు వదిలేలాలేదు. మనం వాడితో తెలివి తక్కువగా మాటలు పెట్టుకున్నాం. గదిలో ప్రవేసిస్తూనే వాణ్ణి కత్తితో నరకవలసింది," అన్నాడు విక్రమకేసరి.

"అవును. ఈసారి వాడు తటస్థపడితే మనం చేయబోయేది అదే. ఆ నీచుడితో మనకు మాట లేమిటి?" అన్నాడు శిఖిముఖి.



అక్కడ చేరినవాళ్ళు శిఖిముఖినీ, విక్రమకేసరినీ రకరకాల ప్రశ్నలు అడగసాగారు. ఎవరో యిద్దరు, పెద్ద దొంగతనం చేసి గుర్రాల మీద పారిపోయారని వాళ్ళనుకున్నారు. సత్రపు యజమాని చేతులు నలుపుకుంటూ నంగిగా, "అయ్యా, ఇందులో నా పొరపాటు చాలా వున్నది. మీరు లేనప్పుడు ఆ పూజారినని చెప్పినతణ్ణి మీ గదిలోకి పోనివ్వవలసింది కాదు. విలువగల వస్తువు లేమైనా ఎత్తుకుపోయాడా?" అని అడిగాడు.

"వాడికక్కవలసిన విలువైన వస్తువు లేవీ మా దగ్గిర లేవు. మేము యాత్రికులం; పుణ్యతీర్థాలు సేవించేందుకు బయలుదేరినవాళ్ళం. మా దగ్గిర విలువైన వస్తువు లేంవుంటవి?" అన్నాడు శిఖిముఖి.

"తమ గదిలో దొంగతనం జగలేదని వినటం నాకు చాలా సంతోషం కలిగిస్తున్నది. ఆ పూజారినన్నవాడి ముఖలక్షణాలు చూస్తే, వాడు ఇభ్యజాతి వాడిలా వున్నాడు. వాళ్ళెంత నమ్మకస్థులో అంత నమ్మకద్రోహులు," అన్నాడు సత్రం యజమాని.

ఆ రాత్రి శిఖిముఖీ, విక్రమకేసరీ సంప్రతించుకుని బ్రహ్మపుత్రానదీ లోయల్లో





ఇభ్యుజాతి వాళ్ళుండే ప్రాంతాలకు దారి చూప గల వాణ్ణొకణ్ణి కుదుర్చుకోవటం మంచిదని నిశ్చయించారు. పెద్దమనిషిలా కనబడుతున్న సత్రం యజమానితో యీ మాట చెపితే, అతడు ఆశ్చర్యపడి, "ఆ ప్రాంతాలకు పోవటం అంత క్షేమం కాదు," అన్నాడు.

శిఖిముఖి ఆ మాటకు చిన్నగా నవ్వి, "మాకు ప్రాణాపాయం కలగవచ్చునే కదా మీరు భయపడుతున్నది. అలాంటి భయం మాకేం లేదు. మమ్మల్ని చంపినందువల్ల ఎవరికీ ఒరిగేదేంవుండదు. ఆ లోయల్లోని చిన్నా పెద్ద పవిత్ర స్థలాలన్నీ చూడ దలిచాం. ముఖ్యంగా ఇభ్యుజాతివాళ్ళుండే ప్రాంతాల అతి పురాతనమైన దేవాలయా లున్నవని విన్నాం. ఎంత కష్టనష్టాలకైనా సరే ఓర్చి వాటన్నిటినీ తప్పక దర్శించి తీరాలి," అన్నాడు.

"అయితే మీ యిష్టం. మీ ప్రయాణం ఎప్పుడో చెప్పండి. ఆ ప్రాంతాలు బాగా తెలిసిన వాణ్ణొకణ్ణి మీ వెంట పంపుతాను. వాడికి తిండీ తిప్పలూ మీరే చూడాలి. తిరిగివచ్చిం తరవాత పారితోషికంగా కొంత డబ్బు యివ్వవలసివుంటుంది," అన్నాడు సత్రంయజమాని.




శిఖిముఖీ, విక్రమకేసరీ అందుకు అంగీ కరించారు. మర్నాడు సూర్యోదయంవేళ పొట్టిగా బలంగా గున్నఏనుగుపిల్లలా వున్న ఒక నడి వయసువాణ్ణి, సత్రంయజమాని వాళ్ళ దగ్గిరకు తీసుకువచ్చి, "అయ్యా, ఇతడి పేరు జాంగ్‌లా. ఇభ్యుజాతి వాళ్ళుండే ప్రాంతాలన్నీ తనకు బాగా తెలుసంటున్నాడు. ఇతడూ ఆ జాతివాడే," అని చెప్పాడు.

శిఖిముఖి అతణ్ణి నఖశిఖ పర్యంతం పరీక్షగా చూశాడు. మనిషిముఖం చూసి స్వభావాన్ని కనిపెట్టేందుకు అతడికి సాధ్య మయేలా కనిపించలేదు. జాంగ్‌లా పెదాల



మీద చిరునవ్వు కదులుతున్నది. ముఖం మీద ఎలాంటి భావం ప్రస్ఫుటం కావటం లేదు. ఎండ వానలకు గురై, బాగా బీటలు బారిన నల్ల రాతిపలకలా వున్నది అతడి ముఖం.

జాంగ్‌లాను పరిచయం చేసి సత్రం యజమాని వెళ్ళిపోగానే, శిఖిముఖి అతడితో, "నీవు నమ్మకస్థుడినా కావా అన్న భయం మాకు లేదు. మేం నలుగురం, నువ్వొక్కడివి. కాని, నీకు ఇభ్యుజాతి వాళ్ళుండే ప్రాంతాలు క్షుణ్ణంగా తెలుసునా లేదా అన్నదే నా అనుమానంగా వున్నది," అన్నాడు.



"నేనెంత నమ్మకస్థుణ్ణో మీరే తెలుసుకుంటారు. పోతే, నేను పుట్టి పెరిగింది ఇభ్యుజాతి వాళ్ళుండే ప్రాంతానే. నేను ఆ జాతివాణ్ణేనని సత్రంయజమాని తమకు చెప్పాడు గదా? ఆయన నన్ను బాగా ఎరుగు," అన్నాడు జాంగ్‌లా.

"సరే, నీకు దారిభత్యం మేమే జరుపుతాం. ప్రయాణం ముగిసి తిరిగి ఈ కామాఖ్యనగరం చేరింతరవాత, నీకు పారితోషికంగా అయిదు బంగారుకాసు లిస్తాం. ఇష్టమేనా? ఆలోచించుకుని చెప్పు," అన్నాడు శిఖిముఖి.

"ఆలోచనెందుకు, తమ దయ!" అన్నాడు జాంగ్‌లా.

"మమ్మల్ని ఆ లోయల్లోని గోల్‌భరా అన్న ఇభ్యుజాతి గ్రామం చేర్చాలి. ఆ దాపుల్లో ఎక్కడో అతిపురాతనమైన ప్రసిద్ధ దేవాలయం వున్నదని విన్నాం." అన్నాడు శిఖిముఖి.

గోల్‌భరా అన్న పేరు వింటూనే జాంగ్‌లా కొంచెం ఉలిక్కిపడి, "చిత్తం. అలాగే అక్కడికి దారి చూపుతాను, ఆ గ్రామం నే నెరిగినదే. కాని, మీ రన్నట్టు అక్కడ ప్రసిద్ధ దేవాలయం ఏమీ లేదు. తరవాత నన్ను తప్పుపట్టకుండా ముందే



వున్న సంగతి తమకు మనవి చేసుకుంటున్నాను," అన్నాడు.

"ఉన్నట్టు మేం విన్నాం, అవునా, కేసరీ?" అంటూ శిఖిముఖి విక్రమకేసరి కేసి చూసి, అతడు అవునన్నట్టు తల వూపగానే, జాంగ్‌లాతో, "నువ్వు మాకు ఆ గ్రామానికి దారి చూపు. అక్కడికి చేరింతరవాత, సంగతి మేం చూసుకుంటాం. ప్రయాణం యీ సాయంకాలమే, సిద్ధంకా," అన్నాడు.

జాంగ్‌లా వాళ్ళకు నమస్కరించి వెళ్ళిపోయాడు. ఆ సాయంత్రం తమకు దారిలో అవసరం అయిన ఆహార పదార్థాలనూ, ఇతర సామగ్రినీ రెండు కంచరగాడిదల మీద వేసుకుని, శిఖిముఖీ, విక్రమకేసరీ నదీ లోయలకేసి బయలుదేరారు. జాంగ్‌లా వాళ్ళకు ముందు నడుస్తూ దారి చూపసాగాడు.

చీకటిపడుతూనే అందరూ అరణ్యంలోని ఒక చిన్న కొలను ప్రాంతం చేరారు. ఆ రాత్రికి అక్కడ ఆగి, వంట చేసుకుని, మర్నాటి వేకువజామున తిరిగి ప్రయాణం కావటానికి వాళ్ళు నిశ్చయించుకున్నారు. వంటపనిలో అజితుడూ, వీరభద్రుడూ నిమగ్నులయారు. జాంగ్‌లా ఎండుపుల్లలు




తీసుకువస్తానని శిఖిముఖితో చెప్పి, అరణ్యంలోకి పోయాడు

శిఖిముఖీ, విక్రమకేసరీ ఒక చెట్టు నానుకుని కూర్చుని తమ ముందు కార్యక్రమాన్ని గురించి మాట్లాడుకో సాగారు. విక్రకేసరికి, జాంగ్‌లా మీద పూర్తి నమ్మకం కలగలేదు. వాడు తమను తప్పుదారి పట్టిస్తాడేమో అన్న అనుమానం అతడు బయటపెట్టాడు. శిఖిముఖినీ యిలాంటి అనుమానమే అప్పుడప్పుడూ పీడిస్తున్నది.

"మన జాగ్రత్తలో మనం వుందాం. ఈ జాంగ్‌లా, శిథిలాలయ పూజారి అను





చరుడేమో అనేగదా నీ భయం. ఆ దుర్మార్గుడే మనను ఏమీ చేయలేనప్పుడు, యీ వెధవ చేయగలిగిం దేమిటి?" అన్నాడు శిఖిముఖి.

విక్రమకేసరి ఏదో జవాబు చెప్పబోయేంతలో, ఎర్రగండు చిన్నగా మొరిగి, దాపుల నున్న గుబురుచెట్ల కేసి బయలుదేరింది. శిఖిముఖి కుక్క వాలకం చూసి, విక్రమకేసరిని హెచ్చరించి, దాని వెనకనే నిశ్శబ్దంగా నడిచాడు.

విక్రమకేసరి కత్తి దూసి నిలబడి, చూట్టూ అలముకుంటున్న చీకటిలోకి గుచ్చి గుచ్చి చూడసాగాడు.



ఎర్రగండు చెట్లల్లో కొంత దూరం ముందుకు పోయి ఒక చోట ఆగి, తల పై కెత్తి మొరగ సాగింది. నేలకు దాదాపు అయిదా రడుగుల ఎత్తులో దట్టంగా పరుచుకుపోయిన చెట్లకొమ్మల కేసి, శిఖిముఖి పరీక్షగా చూశాడు. అక్కడ శత్రు వెవడైనా దాగివున్నాడేమో అన్న సంశయం అతడికి కలిగింది. కాని అక్కడ ఎవరూ వున్నట్టు లేదు. అంతలో అతడికి దూరంగా ఎవరో చిన్నగొంతుతో మాట్లాడుతున్నట్టు అనుమానం కలిగింది. అతడు ముందుకు నడవబోయాడు. ఎర్రగండు అతడి దారిని అడ్డగిస్తూ తల పైకెత్తి పెద్దగా మొరగటం ప్రారంభించింది.

ఈసారి శిఖిముఖికి అడుగుల చప్పుడు స్పష్టంగా వినబడింది. చూస్తూండగానే జాంగ్‌లా భుజం మీద యిన్ని ఎండుపుల్లలు పెట్టుకుని వేగంగా అతడి కేసి రాసాగాడు. శిఖిముఖి అతడి కేసి రెండడుగులు వేసేంతలో చెట్లకొమ్మల్లోంచి ఒక పెద్ద కొండచిలువ తపీ మంటూ జాంగ్‌లా మీద పడి, అతడి శరీరాన్ని బలంగా చుట్టివేయసాగింది. ఎర్రగండు పెద్దగా అరుస్తూ ముందుకు దూకింది, జాంగ్‌లా ఒక చావు కేక పెట్టాడు.



శిఖిముఖి ఓ క్షణకాలం కొయ్యబారి పోయాడు. మరుక్షణంలో అతడికి జాంగ్‌లా ఎలాంటి ఘోర ప్రమాదంలో చిక్కుకున్నాడో అర్థమైంది. అతడు పరిగెత్తుకుంటూ పోయి కొండచిలువ తల నరికేందుకు కత్తి దూశాడు. కాని, కొండచిలువ జాంగ్‌లాను నడుము నుంచి పైన తన దేహంతో బలంగా చుట్టి అతడి తలను ఒడిసి పట్టుకునేందుకు ప్రయత్నిస్తున్నది. ఆ చీకట్లో కత్తి గురి ఏమాత్రం తప్పినా కొండచిలువ తలకు మారుగా జాంగ్‌లా తల తెగి కింద పడే ప్రమాదం వున్నది.

జాంగ్‌లా ఉక్కిరిబిక్కిరై పోతూ చిన్నగా మూలుగుతున్నాడు. శిఖిముఖి, "భయపడకు జాంగ్‌లా! ఇదుగో కొండచిలువను నరికేస్తున్నాను," అంటూ ఎడమచేత్తో పాము మెడ పట్టుకుని యివతలికి లాగుతూ, అదే సమయంలో కత్తితో దాని మెడ మీద బలంగా కొట్టాడు.

తల తెగిపోగానే, జాంగ్‌లా శరీరం మీది నుంచి కొండచిలువ దేహం మెలికలు తిరుగుతూ కింద పడిపోయింది. జాంగ్‌లా పెద్దగా మూలిగి ఒక పక్కకు దభీమంటూ పడిపోయాడు. ఈ గందరగోళం అంతా విన్న విక్రమకేసరి, అజిత వీరభద్రులూ అక్కడికి పరిగెత్తుకు వచ్చారు.

శిఖిముఖి, జాంగ్లాను లేవనెత్తేందుకు వంగుతూ, "కొండచిలువ తల నరికాను. దాని పట్టులో చిక్కి నీ కాళ్ళూ చేతులూ ఏమైనా విరిగిపోలేదు గదా?" అన్నాడు.

జాంగ్‌లా జవాబిచ్చేందుకు గొంతు సవరించుకునేంతలో చీకట్లో నుంచి, "అఘోరీలు భక్తితో పూజించే కొండచిలువ తల నరికిన వాడెవడు? ఇదుగో, నీ తల నరకబోతున్నాం, కాచుకో!" అంటూ నలుగురైదుగురు భయంకరాకారులు, పెద్ద పెద్ద శూలాలు పైకెత్తి, శిఖిముఖి కేసి పరిగెత్తుకు రాసాగారు.

—(ఇంకా వుంది)





# నిత్యయౌవనం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవం లోని బేతాళుడు, "రాజా, నువు అపూర్వ శక్తుల కోసం శ్రమిస్తున్నట్టున్నావు. అవి కొందరికి పుట్టుకతోనే కలుగుతాయి. ఆటవికులలో అలాంటి శక్తులు గలవారు అనేత మంది ఉన్నారు. కాని వాటివల్ల చివరకు నష్టమే కలుగుతుంది. నీకు శ్రమతెలియకుండా ఉండగలందులకు ఒక అపూర్వ శక్తుల కథ చెబుతాను విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

దండకారణ్య ప్రాంతంలో ఉండే కోయలలో కొందరికి జన్మతః అపూర్వశక్తులు కలిగేవి. ఆ సంగతి బిడ్డపుట్టగానే తెలిసిపోయేది. మగబిడ్డకు పుట్టగానే దంతాలన్నీ వచ్చి ఉన్నా, ఆడపిల్ల నెత్తి మీద బొడిపె

## బేతాళ కథలు




ఉన్నా అది అపూర్వశక్తు లున్నట్టు గుర్తుగా ఉండేది. అటువంటి బిడ్డలను కన్న తల్లులు తమ బిడ్డల రహస్యాన్ని లోకానికి తెలియకుండా దాచేవారు. ఎందుకంటే వారి సమాజం అలాంటి బిడ్డలను చంపేసేది.

ఒక కోయపిల్ల నెత్తి మీద బొడిపెతో పుట్టింది. ఆ పిల్ల పేరు ఇల. ఇల తల్లి ఈ రహస్యాన్ని చాలా చక్కగా దాచింది. ఇల పెద్దదై నెత్తి మీద జుట్టు బాగా పెరిగినాక బొడిపె రహస్యం దాచటం చాలా తేలిక అయింది. ఇల యుక్తవయస్కురాలైన దాకా ఆమెలోని అపూర్వశక్తులకు ఎలాటి పనీ తగలలేదు.

ఇల ఉండే అరణ్య ప్రాంతానికి సమీపంలోనే ఒక జమీందారీ ఉండేది. ఆ గ్రామంలోనే ఉపేంద్రుడనే ఒక కమ్మరి యువకు డుండేవాడు. వాడు చాలా అందగాడు, కాని బీదవాడు. గ్రామంలో పెళ్ళి కావలిసి ఉన్న పిల్లల్లో సగం మంది ఉపేంద్రుణ్ణి పెళ్ళాడాలని కలలు కనేవారు. ఇల వాణ్ణి మొదట చూసిన క్షణం నుంచీ చాలా గాఢంగా ప్రేమించి, వాడి కోసం ప్రాణాలు కూడా ధారపొయ్యటానికి సిద్ధపడింది.

కాని 'ఉపేంద్రుడికి ఇల అంటే ఏమీ లక్ష్యం లేదు. నిజానికి వాడు ఎవరినీ నిజంగా ప్రేమించలేదు. ఎవతె అయినా డబ్బుతో వచ్చేది తనను పెళ్ళాడుతుందా అని వాడి ఆలోచన.

ఒక రోజు ఏదో పండగ వచ్చింది. ప్రజలందరూ సంబరం చేసుకుంటున్నారు. ఆ రోజు ఇల ఎక్కడికీ వెళ్ళక, ఉపేంద్రుడు తన కోసం వస్తే బాగుండునని ధ్యానిస్తూ ఇంట్లోనే కూర్చుంది.

రోజంతా గడిచిపోయింది. సూర్యాస్తమానమయింది. ఉపేంద్రుడు ఇల ఇంటి చాయలకైనా రాలేదు. వాడు గ్రామంలో గొప్పింటి పిల్లలతో కోలాటాలాడుతూ మహా ఆనందంలో ఉన్నాడు.

ఇల తన ఇంట్లో ఏవో ముగ్గులు వేసింది. గుడ్డలు చించి పీలికలు చేసింది. మంత్రాలు చదివింది. ఉపేంద్రుడి పేరు ఉచ్చరిస్తూ, గుడ్డపీలికలలో ముడులు వేసింది. ఆ ముడులను ముగ్గులో అక్కడక్కడా పెట్టింది.

కోలాటాలలో మునిగి ఉన్న ఉపేంద్రుడు అకస్మాత్తుగా కోలాటం కర్రలు అవతల పారేసి గ్రామం నుంచి బయలుదేరాడు. వాడి మెదడులో ఏ ఆలోచనా లేదు. వాడి కాళ్ళు అప్రయత్నంగా కోయగూడెం కేసి నడుస్తూ, వాణ్ణి ఇల ఇంటి వద్దకు తెచ్చాయి. వాడు తలుపు తట్టగానే ఇల తలుపు తెరిచింది. ఇలను చూడగానే, చీకటిగా ఉన్న వాడి మనస్సులో వెయ్యి దీపాలు వెలిగినట్టయింది.

మర్నాడే ఇలకూ, ఉపేంద్రుడికీ పెళ్లి అయింది. ఉపేంద్రుడామెను తన ఇంటికి తెచ్చుకుని, వెర్రిగా ప్రేమిస్తూ, ఆమెతో కాపరం చేశాడు. అయిదేళ్ళలోనూ ఇల అయిదుగురు పిల్లలను కన్నది.

ఉపేంద్రుడు తన భార్యలో గమనించిన చిత్రమేమిటంటే, ఒక్కొక్క కానుపుతోనూ ఆమె అందమూ, యౌవనమూ తరగటానికి బదులు హెచ్చుతున్నట్టు కనబడింది. ఇల పెళ్ళికూతురైన నాటి కన్న




కూడా అయిదుగురు పిల్లల తల్లిగా మరింత నేవళంగానూ, ఆకర్షవంతంగానూ ఉన్నది.

ఇది చూసి ఉపేంద్రుడు కొంచెం కలవరపడి తన తల్లితో ఈ మాట చెప్పాడు.

"నీ భార్య ఒకవేళ మంత్రగత్తెమోరా! అలాటిది భార్య కావటం మహా పాపం; నీకూ, నీ పిల్లలకూ కూడా మంచిది కాదు," అన్నది ఉపేంద్రుడి తల్లి.

"ఇల మంత్రగత్తె అవునో కాదో ఎలా తెలుస్తుంది?" అన్నాడు ఉపేంద్రుడు.

"అది నిజంగా మంత్రగత్తే అయితే, అమావాస్య పర్వదినం అర్ధరాత్రివేళ ఏదో ఒక తాంత్రిక పూజ చెయ్యకుండా ఉండదు.



ఈసారి అమావాస్య రాత్రి దానికి తెలియకుండా గమనించు," అన్నది తల్లి.

ఆ తరవాత వచ్చిన అమావాస్యనాడు ఉపేంద్రుడు నిద్రపోతున్నట్టు నటిస్తూ, మేలుకునే ఉండి తన భార్య ఏం చేసేదీ గమనించాడు. ఇల అర్ధరాత్రి వేళ లేచి, నిప్పు చేసి, పొయి మీద నీళ్ళకుండ పెట్టి, ఏవో మూలికలు తెచ్చి, మంత్రాలు చదువుతూ ఆ మూలికలను కుండలో వేసింది.

ఇదంతా గమనించిన ఉపేంద్రుడు తాను చూసినదంతా తల్లికి చెప్పాడు.

"అది నిశ్చయంగా మంత్రాలమారే. దాన్ని వెంటనే చంపకపోతే నీకూ, నీ పిల్ల



లకూ ఘోరాలు తప్పవు. మాయలమారి దానికి సజీవదహనం తప్ప మరొక రకం చావు లేదు," అన్నది తల్లి.

"నా పిల్లల తల్లిని చేజేతులా ఎలా చంపను?" అన్నాడు ఉపేంద్రుడు.

"ఒక్క ప్రాణం కోసం చూస్తే, మిగిలిన ఆరు ప్రాణాల మాటా ఏమిటి? తప్పకుండా నువు నీ పెళ్ళాన్ని బూడిద చేసి తీరాలి," అన్నది తల్లి.

తల్లితో చాలాసేపు వాదించిన మీదట ఉపేంద్రుడు తన భార్యను చంపటం తన విధి అని గ్రహించాడు. అతను ఇంటికి వచ్చి, తన ఇంటి ముందు చెట్టు కింద చితి పేర్చి, చెట్టు కొమ్మకు ఒక తాడు కట్టి, దానికి ఉచ్చు తయారుచేశాడు.

ఇదంతా ఇంటి కిటికీలో నుంచి చూస్తున్న ఇల బయటికి వచ్చి, "ఏమిటిదంతా?" అని అడిగింది.

"చెబుతాను. ఒకసారి ఇలా వచ్చి, ఈ కట్టెల మీదికి ఎక్కు," అన్నాడు ఉపేంద్రుడు. ఇల వచ్చి చితి మీద ఎక్కింది. ఉపేంద్రుడు ఆమె మెడకు ఉచ్చు తగిలించి, "నువు మంత్రగత్తెవు గనక నిన్ను తగలేసి, నన్నూ, పిల్లలనూ రక్షించుకోబోతున్నాను," అన్నాడు. అతను కట్టెలకు






నిప్పు అంటించి, చప్పున ఇంట్లోకి వెళ్ళి తలుపు వేసుకున్నాడు.

కట్టెల మంటలు తన బట్టలను అంటుకోగానే ఇల ఏదో మంత్రాలు చదివి, మాయమై, ఒక పువ్వుగా మారిపోయి, చెట్టుకొమ్మకు అంటుకు పోయింది.

మర్నాడు ఉదయం జమీందారు గుర్రం మీద అటుగా వచ్చి, "ఇటువంటి చెట్టు కొమ్మన ఇటువంటి పువ్వు పుయ్యటం విడ్డూరంగా ఉందే!" అనుకుని, ఆ పువ్వును కోసుకుని, ఇంటికి పోయి, దాన్ని నీటిలో పెట్టించి తన గదిలో ఉంచుకున్నాడు.

ఈ జమీందారు వృద్ధుడు. అయనకు భార్యా, పిల్లలూ లేరు. వంటలక్క ఆయన గదికే భోజనం తెచ్చి పెట్టేది. తెచ్చిన భోజనంలో కొంచెం మాత్రమే అయన తిని పడుకుని కునుకు తీసేవాడు.

ఆయన అలా నిద్రపోగానే నీటిలో నుంచి పువ్వు కిందికి దూకి, ఇలగా మారి అయన మిగిల్చిన భోజనమంతా తినేసి, మళ్ళీ పువ్వుగా మారి ఎగిరి, నీటిలో పడింది.

వంటలక్క వచ్చి గిన్నెలన్నీ ఖాళీగా వుండటం చూసి, ఇందులో ఏదో రహస్యం ఉన్నదనుకున్నది. జమీందారు చేసిన వంటలో సగం కూడా ఏ నాడూ తినడు. ఆయన కోసం చేసిన వంటకాలన్నిటినీ వంటలక్కే ఆరగిస్తూ ఉండేది. కాని ఇవాళ ఆమెకు ఒక్క నలుసు కూడా మిగల్లేదు.

రెండో పూట వంటలక్క చాటున పొంచి ఉండి, పువ్వు ఆడపిల్లగా మారి, జమీందారు తినగా మిగిలినది భోజనం చెయ్యటం గమనించి, ఈ మాట జమీందారుకు చెప్పేసింది.

మర్నాడు జమీందారు భోజనం చేసి నిద్రపోక కళ్ళు అరమూసి పడుకుని ఇల భోజనం చేస్తూండగా పట్టుకున్నాడు. తప్పించుకోవటానికి ఇల ప్రయత్నించటంలో ఆమె జుట్టు జమీందారుకు చిక్కింది.



"నా జుట్టు వదలండి. చాలా బాధగా ఉన్నది," అన్నది ఇల.

"అలాగే వదులుతాను. కాని నువ్వు పువ్వుగా మారటం మాని నాకు భార్యగా ఉండి పోవాలి," అన్నాడు జమీందారు.

ఇల ఇందుకు ఒప్పుకోలేదు. జమీందారు ఆమె జుట్టు పట్టుకుని లాగి, ఆమె చేత సరే ననిపించాడు. జమీందారు భార్య కాగానే ఇల వంటలక్కను వెళ్ళగొట్టింది. వంటలక్క కోయవాళ్ళలో భూతవిద్యలు తెలిసిన వాళ్ళ దగ్గిరికి పోయి, జమీందారు కొత్త భార్య సంగతి చెప్పి, ఆమె మీద పగతీర్చుకునే ఉపాయం చెప్పమన్నది.

"జమీందారు భార్య మంత్రగత్తె అయి ఉండాలి. ఆమె నెత్తిన బొడిపె ఉంటుంది. ఆ బొడిపె మీది వెంట్రుకలు కత్తిరిస్తే మంత్రశక్తులు పోతాయి," అని భూత విద్యలు తెలిసినవాళ్ళు చెప్పారు. కాని జమీందారు భార్యను పట్టుకుని ఆమె జుట్టు కత్తిరించే మార్గం ఏమిటో వంటలక్కకు తెలియలేదు.

ఈ లోపల జమీందారు తన చిన్న భార్యకు అంతులేని అమూల్య వస్త్రాలూ, ఆభరణాలూ ఇచ్చాడు. ఆమె జమీందారుతో సహా బండిలో షికార్లకు పోతూ ఉండేది. ఒకనాడు ఆమె కమ్మరి ఇంటి ముందుగా పోతూండగా, ఆ ఇంటి ముందు మట్టిలో పొర్లిగింతలు పెట్టి ఆడుకుంటూ అయిదుగురు పిల్లలు కనిపించారు.

ఇల వెంటనే బండిని ఆపించి, కిందికి దూకి వెళ్ళి, తన పిల్లలను ఎత్తుకుని, ముద్దాడింది. తన మేలివస్త్రాలు మట్టి అయిపోయినా ఆమె లక్ష్యపెట్టలేదు. ఆమె తమ తల్లేనని పిల్లలూ గుర్తించలేదు. కాని వాళ్ళు ఆమె మీదికి పాకి, ఆనందంతో కేరింతాలు కొట్టసాగారు. వాళ్ళ కేకలు విని ఉపేంద్రుడు బయటికి వచ్చాడు. అతను కూడా ఇలను గుర్తించలేదు.

"వీళ్ళు నీ పిల్లలేనా, కమ్మరీ? వాళ్ళ నిలా మట్టిలో పొర్లనివ్వటానికి నీకు సిగ్గు లేదా? చూడు, తిండి కూడా సరిగా లేక ఎలా బక్కచిక్కి ఉన్నారో!" అన్నది ఇల.

"పేదవాణ్ణి. వాళ్ళకు ఏం తిండి పెట్టను?" అన్నాడు ఉపేంద్రుడు.

"రేపు మా యింటికిరా, నీకు పని చెబుతాను. ముందుగా బయానా కింద ఇది ఉంచుకో," అంటూ ఇల తన భర్తకు బరువైన డబ్బుల సంచీ ఇచ్చింది. మర్నాడు ఉపేంద్రుడు జమీందారు ఇంటికి వెళ్ళాడు.

"స్నానాల గదిలో చిన్న మరమ్మతు ఉన్నది. ముందు దాని సంగతి చూడు," అంటూ ఇల అతన్ని స్నానాల గదికి తీసుకుపోయి, "చూడు, మట్టికొట్టుకుని ఎలా ఉన్నావో. ముందు స్నానం చేసి, మంచి బట్టలిస్తాను వేసుకో," అన్నది.

ఉపేంద్రుడికి అంతా అయోమయంగా ఉన్నది. అతను స్నానాల గదిలో స్నానం చేసి, మంచి బట్టలు వేసుకుని ఇవతలికి వచ్చాడు. ఇల ఇక నిగ్రహించుకోలేక అతన్ని కౌగలించుకుని, "నన్ను గుర్తించలేదా? ఇలను!" అన్నది.

అంతవరకూ ఉపేంద్రుడికి ఆమె మొహం కేసి సూటిగా చూసే ధైర్యం లేకపోయింది.



ఇప్పుడతను ఆమె మొహం చూసి, "ఇక్కడికెలా వచ్చావు?" అని అడిగాడు.

"నువు నన్ను వదిలించుకో దలిచావని కోపం వచ్చి, ఈ ముసలి జమీందారును పెళ్ళాడాను. కాని నాకు ఈయనంటే ఇష్టం లేదు. నీ కోసమూ, పిల్లల కోసమూ నా ప్రాణాలు కొట్టుకుపోతున్నాయి. నేను వచ్చేస్తాను," అన్నది ఇల.

"అది అంత తేలిక అనుకున్నావా? నువు కనపడకపోతే జమీందారు నీ కోసం అంతటా వెతికిస్తాడు. అప్పుడు మన పాట్లు కుక్కలూ, నక్కలూ కూడా పడవు. అయినా, ఇవాళ రాత్రికి నన్ను ఆలోచించు



కోనీ. రేపు మళ్ళీ కనిపిస్తాను," అన్నాడు ఉపేంద్రుడు.

"రేపు తప్పకుండా రా. మరిచేవు!" అని ఇల, జమీందారు తన కిచ్చిన నగలన్నీ మూట కట్టి ఉపేంద్రుడి కిచ్చేసింది.

అతను ఇంటికి వస్తుండగా దారిలో వంటలక్క కనబడి, "ఎక్కడి నుంచి వస్తున్నావు, నాయనా?" అని అడిగింది.

"జమీందారుగారు పిలిస్తే వెళ్ళి పని చూసి వస్తున్నాను. తిండి మూటగట్టి ఇచ్చారు," అన్నాడు ఉపేంద్రుడు.

"ఆ జమీందారు పెళ్ళాం ఏదన్నా పెడితే తినకు నాయనా! అది మాయుల



మారిది. అది పెట్టిన తిండి తిన్నావంటే శిల అయిపోగలవు!" అన్నది వంటలక్క.

"ఈ సంగతి నీ కెలా తెలుసు?" అన్నాడు ఉపేంద్రుడు.

"నేను జమీందారు దగ్గిర వంటలక్కగా పనిచేసేదాన్నిగా. ఆ మనిషి పువ్వుగానూ, మనిషిగానూ మారటం నా కళ్ళారా చూశాను. పని మానుకున్న తరవాత కిటుకు తెలిసింది గాని, ముందుగా తెలిస్తేనా? దాని మంత్రాలూ, మాయలూ క్షణంలో వదల గొట్టి ఉందును," అన్నది వంటలక్క.

"ఎలా? ఏమిటా కిటుకు?" అన్నాడు ఉపేంద్రుడు.

"ఎంత తేలికనుకున్నావు? దాని తల వెనకజుట్టు కత్తిరిస్తే అది మామూలు మనిషి అవుతుంది. వీలుంటే ఆ పని చేద్దును!" అని వంటలక్క వెళ్ళిపోయింది.

మర్నాడు ఉపేంద్రుడు బయలుదేరుతూ, తన పనిముట్ల సంచీలో ఒక కత్తెర కూడా పెట్టుకున్నాడు. అతని కోసం ఆత్రంగా కిటికీలో నుంచి చూస్తున్న ఇల, తలుపు తెరిచింది. అతను లోపలికి రాగానే, "ఏమన్నా ఆలోచించావా?" అన్నది.

"ఆలోచించాను. నీ గదికి పద, చెబుతాను," అన్నాడు ఉపేంద్రుడు.



ఇద్దరూ గదిలోకి చేరగానే అతను కత్తెర తీసుకుని, ఒక చేత్తో ఇలను గట్టిగా పట్టుకుని ఆమె జడపాయలు కత్తిరించసాగాడు.

"ఏమిటీ పని? ఎందు కిలా చేస్తున్నావు?" అని ఇల గిలగిలా కొట్టుకున్నది. కాని ఆమె జుట్టుపాయలన్నీ కత్తిరించిన దాకా అతను మానలేదు.

జుట్టుపోగానే ఇల కున్న శక్తులతోబాటు నిత్యయౌవనం కూడా పోయింది. ఆమె కళ్ళు లోతుకుపోయి, వాటి కింద గుంటలు ఏర్పడ్డాయి. శరీరంలో అంతదాకా ఉండిన జిగిపోయింది.

ఆమె తన చేతులు చూసుకుని ఏడుస్తూ, "నా అందమంతా పోయింది. నన్ను చూసి అసహ్యించుకుంటావు," అన్నది.

"లేదు, ఇలా! నా కళ్ళకు ఇలా ఉంటేనే అందంగా ఉన్నావు. ఇంటికి పోదాం పద," అన్నాడు ఉపేంద్రుడు.

వాళ్ళిద్దరూ వచ్చేస్తుంటే జమీందారు కనిపించి, "నా భార్య చెప్పిన పని ముగించావా?" అని ఉపేంద్రుణ్ణి అడిగాడు.

"ఏలినవారు క్షమించాలి. ఈ మధ్య పారిపోయిన నా భార్య తమ ఇంటినౌకర్ల మధ్య కనిపిస్తే ఇంటికి పట్టుకుపోతున్నాను," అన్నాడు.




"తప్పకుండా తీసుకు పో. పెళ్ళాలు మొగుళ్ళను విడిచి పారిపోవటం మహా నేరం," అన్నాడు జమీందారు. ఆయన తన భార్య కోసం ఊరూ, వాడా గాలించి, ప్రాణం విసిగి, వంటలక్కను మళ్ళీ తెచ్చుకున్నాడు.

జమీందారు వద్ద నుంచి తెచ్చుకున్న నగలు అమ్మి, ఇలా ఉపేంద్రులు సుఖంగా బతుకుతూ, ఇంకా పిల్లలను కన్నారు.

బేతాలు ఈ కథ చెప్పి, "రాజా, నా కొక సందేహం. ఉపేంద్రుడు నిత్యయౌవనంతో బాటు అందాన్ని కోల్పోయిన ఇలను ఎందుకు తెచ్చి ఏలుకున్నాడు? ఆమెను

విడిచి పుచ్చేశక్తి లేకనా? ఆమెలో ఇప్పుడు అపూర్వశక్తు లేవీ లేవు కూడా కద. అతను విడిచిపెట్టేస్తే ఆమె ఏమీ చెయ్యలేదే. అటువంటప్పుడు కూడా అతను ఆమెను ఎందుకు చేరదీశాడు? ఈ రహస్యం నీకు తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "ఉపేంద్రుడిలో సౌందర్యభ్రాంతి ఏనాడూ ఉన్నట్టు కనబడదు. అతను ఇలను పెళ్ళికి ముందు కూడా మోహించలేదు. ఇల తన మంత్ర శక్తులతో అతన్ని తన దగ్గిరికి తెచ్చుకున్నది గాని, అతన్ని నిజంగా వశం చేసుకున్నది తన ప్రేమతోనే. ఇలకు అతనిపై గల ప్రేమ అసాధారణమైన దనటానికి సందేహం లేదు. ఉపేంద్రుడికి సౌందర్యభ్రాంతి లేదనటానికి మరొక నిదర్శనం, తన భార్య నిత్య యౌవనం చూసి అతను ఆందోళన పడి, తన తల్లితో దాన్ని గురించి ప్రస్తావించటమే. నిజంగా సౌందర్యభ్రాంతి కలవాడైతే తన భార్య నిత్యయౌవని అయినందుకు తన అదృష్టాన్ని మెచ్చుకుని ఊరుకునేవాడే. తన భార్యది మాయసౌందర్యం అని తెలిశాక అతను ఆమెను పోగొట్టుకోవటానికి సిద్ధపడ్డాడు. ఆమె జమీందారు భార్య అయినది తన మూలంగానే అని తెలిసినాక అతను ఆమెను అందుకు తప్పు పట్టలేదు. కాని జమీందారు ఇంట సర్వసుఖాలూ ఉండి కూడా ఆమె ప్రాణం తన కోసమూ, తన బిడ్డల కోసమూ పీకుతున్నదంటే అతను అలాంటి భార్యను ఎలా వదులుకుంటాడు? ఆ భార్య నిత్యయౌవనాన్ని పోగొట్టుకుంటే అతని కది ఒక లెక్కలోకి రాదు. అందుకే యౌవనాన్ని పోగొట్టుకున్న భార్యను అతను సంతోషంగా ఏలుకున్నాడు," అన్నాడు.

రాజు కీ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)





# అందంలో పోటీ

ఒకప్పుడు వైకుంఠంలో విష్ణువు భార్యలైన జ్యేష్ఠాదేవికీ, లక్ష్మీదేవికీ, ఎవరు ఎక్కువ అందం అని వాదం ఏర్పడింది. తీర్పు చెప్పమని వారు తమ భర్త అయిన విష్ణుమూర్తినే అడిగారు.

"మీలో ఒకరి అందం కన్న ఇంకొకరి అందం ఎక్కువని చెప్పి, మీ ఇద్దరి కీచులాటల మధ్య ఇరకటం నా కిష్టంలేదు. మీరు నిజం తెలుసుకోవాలంటే బ్రహ్మ దగ్గరికి వెళ్ళటం మంచిది," అన్నాడు విష్ణువు.

ఆ మీదట వాళ్ళిద్దరూ బ్రహ్మలోకానికి వెళ్ళారు. సరస్వతి వారు వచ్చినపని అడిగింది. వాళ్ళు తమలో ఎవరి అందం గొప్పదో బ్రహ్మనడిగి తెలుసుకోవటానికి వచ్చామన్నారు.

సరస్వతి ద్వారా విషయమంతా తెలుసుకున్న బ్రహ్మదేవుడు వారితో, "తల్లులారా, నా కళ్లకు మీరిద్దరూ సమంగానే కనిపిస్తారు. తన తల్లిని మించిన అందగత్తె ప్రపంచంలో ఉంటుందని ఏ కొడుకన్నా ఒప్పుకుంటాడా? అందుచేత మీ అందాలలో తేడా నిర్ణయించే శక్తి నాకులేదు. నా సలహా ఏమంటే, మీరు కైలాసానికి వెళ్ళి శివుణ్ణి అడగండి. ఆయన చాలా బోళామనిషి. నిజం చెప్పటానికి ఏమాత్రమూ జంకడు," అన్నాడు.

బ్రహ్మ సలహా ప్రకారం జ్యేష్ఠాదేవీ, లక్ష్మీదేవీ కైలాసానికి వెళ్ళి పార్వతీ పరమేశ్వరులను చూశారు. తమలో ఎవరి అందం గొప్పదో తేల్చుకోవటానికి వారు వచ్చినట్టు తెలియగానే శివుడు వారితో, "నాకు పెద్ద చిక్కే తెచ్చిపెట్టారు. అసలే నేను నా భక్తులకు తొందరపడి వరాలివ్వటమూ, అందువల్ల ఏర్పడ్డ చిక్కులను మీ భర్త తొలగిస్తూ ఉండటమూ తరుచుగా జరుగుతున్నది. అలాటప్పుడు మీ భర్త సైతం తేల్చలేని సమస్యను నేను తేల్చగలగటం ఊహించ

ఎస్. భాగ్యలక్ష్మిదేవి

రాని విషయం. ఈ విషయంలో ఏమాత్రమూ మొహమాటం లేకుండా చెప్పగలవాడు నారదుడు," అన్నాడు.

శివుడీ మాట అంటుండగానే నారదుడు వచ్చాడు. "సమయానికి వచ్చావు. నువు నిష్కపటంగా చెప్పు. మా ఇద్దరిలో ఎవరి అందం హెచ్చు?" అని పెద్దమ్మా, చిన్నమ్మా నారదుణ్ణి అడిగారు.

"అమ్మలారా, బ్రహ్మచారిని, నాకు అందం సంగతి ఏం తెలుస్తుంది? మీరు మీ అనుమానం తీర్చుకోవాలంటే భూలోకానికి వెళ్ళి, భద్రయ్యశెట్టి అనే వైశ్యోత్తముణ్ణి అడగండి. ఆయన తప్పక మీ అనుమానం తీరుస్తాడు," అన్నాడు నారదుడు.

పెద్దమ్మా చిన్నమ్మా భద్రయ్యశెట్టి ఇంటికి వెళ్ళారు. వారిని చూస్తూనే శెట్టి దేవతలని గుర్తించి, సాష్టాంగదండప్రమాణాలు ఆచరించి, "తల్లులారా, మీకు నా మీద ఇంత అనుగ్రహం కలగటానికీ, మీరు నా యిల్లు పావనం చెయ్యటానికీ కారణ మేమిటి?" అని అడిగాడు.

"మాలో ఎవరు ఎక్కువ అందంగా ఉన్నారో చప్పున చెప్పెయ్యి. మా దారిన మేం పోతాం," అన్నారు దేవతలు.

"దానికేం భాగ్యం?" అని శెట్టి వారిద్దరినీ నిలబెట్టి, తాను వారికి దూరంగా కూర్చుని, వారిని తన దగ్గిరికి నడిచి రమ్మన్నాడు. తరవాత వాళ్ళను ముందు నిలుచున్నచోటికి నడిచి పొమ్మన్నాడు. వాళ్ళు అలాగే చేశారు.

"మీ అందంలో చాలా తేడా ఉన్నది. చిన్నదేవి వచ్చేటప్పుడు హెచ్చు అందంగా ఉన్నది. పెద్దదేవి వెళ్ళేటప్పుడు ఎక్కువ అందంగా ఉన్నది," అన్నాడు శెట్టి.

ఇద్దరూ సంతోషించారు. లక్ష్మీదేవి వచ్చి శెట్టిగారింటనే కూర్చున్నది. పెద్దామె శెట్టికి వీపుపెట్టి నడుచుకుంటూ వెళ్ళిపోయింది. అందుకే వైశ్యులు లక్ష్మీసంపన్నులయారు.





# వాత్సల్యం

ఒక గ్రామంలో ఒక రైతు ఉండేవాడు. అతని కొడుకు మోహనుడు వట్టి సోమరి పోతుగానూ, నిష్ప్రయోజకుడుగానూ తయారై, తండ్రికి ఏవిధంగానూ సాయ పడకపోయాడు. తండ్రి ఆ కొడుకును గురించి ఎంతో బాధపడి, వాణ్ణి ప్రయోజకుణ్ణి చెయ్యాలన్న పట్టుదలకొద్దీ, నయానా భయానా ఎంతో ప్రయత్నించి చూశాడు. కాని అందువల్ల కొంచెం కూడా ప్రయోజనం లేకపోయింది.

మోహనుడు యుక్తవయస్కుడయాడు. వాడికి కుటుంబభారం మీదపడ్డాక బాధ్యతలు తెలిసి వస్తాయనుకుని తండ్రి వాడికి పెళ్లి చేశాడు.

పెళ్లికాగానే మోహనుడు తండ్రి వద్దకు వచ్చి, "నాన్నా, నా ఆస్తి నాకు పంచు. నా దారిన నేను బతుకుతాను. నే నిక ఈ ఇంట వుండను," అన్నాడు.

తండ్రి ఆశ్చర్యపడి, "నీ కిప్పుడు వచ్చిన ఇబ్బంది ఏమిటిరా, అబ్బాయి? నిన్ను వేరుపడమని ఎవరన్నారు? చాతనయిన దేదో సంపాదించుకుని నా ఎదటనే ఉంటే నేనూ సంతోషిస్తానుగా?" అన్నాడు.

"నామీద ప్రేమ ఉన్నట్టు నటనకూడా దేనికి? నేనంటే మొదటి నుంచీ నీకు ద్వేషమే. ప్రేమ ఏకోశానా లేదు. ఇంత కాలమూ నన్ను తిట్టి, కొట్టి, రాచి రంపాన పెట్టావు. ఇప్పుడేమో, నేను ఎటైనా పోయి స్వతంత్రంగా బతుకుతానంటే అభ్యంతరం చెబుతున్నావు. నేను ఇప్పటికైనా వేరుపోయి సుఖపడటం నీకు ఇష్టంలేదు," అన్నాడు మోహనుడు.

"అలా ఎప్పటికీ అనుకోకు. ఎక్కడ ఉన్నా నువ్వు సుఖంగా ఉండటమే నాకు కావలిసింది," అని తండ్రి కొడుకు వాటా పంచి ఇచ్చాడు. మోహనుడు మరొక

యం. డి. గౌస్ మొహియుద్దీన్

గ్రామం వెళ్ళిపోయి, అక్కడ కాపరం పెట్టి, కూలీనాలీ చేసుకుంటూ ఎలాగో సంసారం ఈదసాగాడు.

సంవత్సరం తిరిగేసరికల్లా మోహనుడికి ఒక కొడుకు పుట్టాడు. మోహనుడిలాగే వాడు కూడా పనికి మొండీ, తిండికి మెండూగా తయారయాడు. వాడి బుద్ధులూ, వాలకమూ చూస్తున్నకొద్దీ మోహనుడికి మండిపొయ్యేది.

ఒకరోజు కోపం పట్టలేక మోహనుడు తన కొడుకును బాగా కొట్టాడు. వాడు ఇల్లు వదిలి దగ్గరలోనే ఉన్న తాతగారి ఊరు పోయి; తాతతో జరిగినది చెప్పాడు.

తాత వాణ్ణి తన గ్రామంలోనే ఉన్న మరొకరి ఇంటికి తీసుకుపోయి, ఇంటి యజమానితో మాట్లాడి, నాలుగురోజులపాటు వాడు అక్కడే రహస్యంగా ఉండేటట్టు ఏర్పాటుచేశాడు.

తన చేత తన్నులుతిని కొడుకు మాయమయే సరికి మోహనుడు గాభరాపడ్డాడు. ఎంత వెతికినా వాడిజాడ తెలియలేదు. మోహనుడు వాణ్ణి వెతుక్కుంటూ తన తండ్రి దగ్గిరికి వచ్చి, "నాన్నా, మావాడేమన్నా ఇటుకేసి వచ్చాడా? వాడు బొత్తిగా కూర్చున్నచోటి నుంచి కదలడు, ఎంత చిన్నపని చెప్పినా చెయ్యడు. మొన్న



ప్రాణం విసిగి నాలుగు తగిలించాను. ఆ తరవాత వాడు ఎటువెళ్ళాడో మరి, ఇంటికి తిరిగి రాలేదు," అన్నాడు.

"పోతేపోయాడులేరా. సోమరి వెధవ, ఉండి ఉద్ధరిస్తాడా? అలాంటి వాణ్ణి గురించి నువ్వేమీ విచారించకు," అన్నాడు మోహనుడితో తండ్రి.

మోహనుడు ఇంకేమీ అనక విచారంగా ఇంటికి తిరిగి వెళ్ళాడు. తన భర్త కొడుకు జాడ తెలుసుకోకుండానే తిరిగి వచ్చేసరికి మోహనుడి భార్య, "వాణ్ణికొట్టి ఏం ప్రయోజనం? వాడి బుద్ధి ఏమన్నా మార్చగలిగారా? చిన్న వెధవ ఏమైపోయాడో," అంటూ బావురుమన్నది.

ఉన్న ఒక్క కొడుకునూ చేజేతులా పోగొట్టుకున్నాననే దిగులుతో మోహనుడు మంచంపట్టాడు.

ఈ సంగతి తెలిసి మోహనుడి తండ్రి తన మనవణ్ణి వెంటబెట్టుకుని మోహనుడి ఇంటికి బయలుదేరి వచ్చాడు. మోహనుడు కొడుకును చూడగానే కౌగలించుకుని, బావురుమని ఏడ్చాడు.

మోహనుణ్ణి తండ్రి ఓదార్చుతూ, "పితృవాత్సల్యం అట్లాగే వుంటుందిరా, నాయనా! వాడు అప్రయోజకుడవుతున్నాడన్న బాధ కొద్దీ కొట్టావుగాని, వాడి మీద ప్రేమలేక కొట్టావా? నాలుగురోజులు వాడు ఎదట లేకుండా పొయ్యేసరికి ఎలా డీలాపడి పోయావో చూడు! నేనూ అంతే. నువు బాగుపడవేమోనన్న బాధతోనే నిన్ను తిట్టాను, కొట్టాను. నీ మీద ప్రేమలేకకాదు. ఎంత చెప్పినా వినకుండా నువు వేరుపడి పోయిననాడు నే నెంత క్షోభపడ్డానో ఇప్పుడు తెలిసివచ్చిందా?" అన్నాడు.

ఆ తరవాత మోహనుడు భార్యా బిడ్డలతో తన తండ్రి ఇంటికి తిరిగిపోయి, వ్యవసాయంలో తండ్రికి సహాయపడుతూ సుఖంగా జీవించాడు.



# విశ్వాసం

గురువు మీద అచంచల విశ్వాసం గల ఒక శిష్యుడు గురువు యొక్క నామాన్ని స్మరిస్తూ, నీటి మీదనే నడిచి యేరు దాటాడు. ఈ సంగతి తెలిసింది గురువు గారికి. "ఓహో, నా పేరులోనే యింత మహిమవుందే! ఇక నేను ఎంతటి గొప్పవాణ్ణి! నాకు అసాధ్యమైంది ఏముంది?" అనుకున్నాడు.

మరుదినం "నేను! నేను!" అనుకుంటూ నదిలోని నీటి మీద నించి నడవాలని యత్నించాడు గురువు. కానీ నీటిలో దిగగానే, మునిగిపోయి ప్రవాహంలో పడి కొట్టుకుపోయాడు పాపం.

—చక్రపాణి నరసింహారావు





# రాజకుమారులు

ఛత్రపురరాజు సుధన్వుడు చిన్నతనంలో నానా దేశాలూ సంచరించి, ప్రపంచం ఎంతో చూసినవాడు. అతనితో బాటు శ్రీపుత్రుడు అనే మరొక రాజకుమారుడు కూడా ప్రపంచ పర్యటన చేశాడు. ఇద్దరూ కవలపిల్లల్లాగా ఎంతో అన్యోన్యంగా ఉంటూ, ఎంతటి బలశాలులతో పోరాటం వచ్చినా జయిస్తూ వీరవిహారం చేసి, యుక్తవయస్కులు కాగానే వివాహాలు చేసుకుని ఎవరి దారిన వారు తమ తమ రాజ్యాలకు వెళ్ళిపోయి, కాలక్రమాన రాజ్యాభిషేకాలు చేసుకుని, పాలకులైనారు. శ్రీపుత్రుడి రాజ్యం ఛత్రపురానికి అనేక వందల యోజనాల దూరాన ఎక్కడో ఉన్నది.

ఛత్రపురరాజుకు చాలా కాలం పిల్లలు పుట్టలేదు. ఆయన ఒకసారి వేటకు పోయినప్పుడు ఒక బోయవాడు కనిపించి, ఆయన చెయ్యి చూసి, "రాజా, నీకు ఒక చేప ప్రభావం వల్ల ఒక కొడుకు పుడతాడు. కాని నువ్వు మటుకు ముగ్గురు కొడుకులను సాకుతావు," అని చెప్పాడు.

సుధన్వుడికి వాడన్నది అర్థం కాలేదు. అయినా వాడి మాటలను ఆయన పట్టించుకోనూ లేదు. అయితే ఆ మాట అక్షరాలా నిజమయింది. రాజు వేట నుంచి తిరిగి వచ్చేలోపల రాజుగారి జాలర్లు ఒక పంచరంగుల చేపను తెచ్చి అంతఃపురంలో ఇచ్చారు. ఆ చేప అపూర్వంగా ఉండటం చేత వంటలక్క దాన్ని వండి, రాణిగారికి పెట్టేముందు తాను రుచి చూసింది. చేప చాలా రుచిగా ఉన్నది. వంటలక్క మరి కొంచెం తిని రాణిగారికి వడ్డించింది. రాణి కూడా దాన్ని పూర్తిగా తినక కొంత వదిలేసింది. రాణిగారు వదిలేసినదాన్ని రాణిగారి పరిచారిక తినేసింది. ఆ చేపను తిన్న రాణీ, వంటలక్కా, దాసీ కూడా గర్భ

ఎం. సత్యారావు



వతులై, పదిమాసాల అనంతరం ఒకే రోజున మగపిల్లలను ప్రసవించారు.

ముగ్గురికీ ఒకేసారి మగపిల్లలు పుట్టటమే అబ్బుర మనుకుంటే, ఆ ముగ్గురూ ఒకే రూపు కలిగి ఉండటం మరింత అద్భుత మనిపించింది. రాజు తన కళ్ళతో చూస్తేనే గాని నమ్మనని, ముగ్గురు పిల్లలనూ తెప్పించాడు. ఆ సమయంలో పిల్లలు తారుమారై పోయారు.

"ఇప్పుడు వీళ్ళను నమ్మకంగా వేరు చెయ్యటం సాధ్యంకాదు. ముగ్గురూ ఒకే అచ్చులో పోసినట్టున్నారు గనక అందరినీ నా పిల్లలుగానే పెంచుతాను. ముగ్గురికీ మూడు రంగుల బట్టలు మాత్రం వెయ్యండి," అని రాజు ఉత్తరు విచ్చాడు. పిల్లలకు ధీరుడూ, వీరుడూ, శూరుడూ అని పేర్లు పెట్టారు.

వాళ్ళు ముగ్గురూ యుక్తవయస్కులయాక సుధన్వుడు వారిని పిలిచి, "మీలో ఒకరు నా అనంతరం సింహాసనం మీద కూర్చుంటారు. మీ శక్తిసామర్థ్యాలు నాకు తెలియాలి. మీరు మన అశ్వశాలకు వెళ్ళి, మీకు నచ్చిన గుర్రాలను తీసుకుని, దేశాలు తిరిగి, నేనెన్నడూ చూడనిది ఏదన్నా పట్టుకు రండి. వెళ్ళండి!" అన్నాడు.

రాజకుమారులు ముగ్గురూ కూడబలుక్కున్నారు. ధీరుడికీ, వీరుడికీ రాజు కోరినది ఏమీ బాగాలేదు. "ఎందుకీయన మనని ఇలా తరిమేస్తున్నాడు?" అని వాళ్ళు విసుక్కున్నారు.

"ఆయన చెప్పినది అసంగతం కాదే! కాస్త ప్రపంచజ్ఞానం సంపాదించటం మనకే మంచిది," అన్నాడు శూరుడు.

వాళ్ళు ముగ్గురూ మంచి గుర్రాలను ఎన్నుకుని, వాటి మీద చాలా రోజులు ప్రయాణం చేసి, ఒక వింత తోపు చేరారు. అందులో ఒక నేరేడు చెట్టున వెండి రంగుగల కాయలున్నాయి. ధీరుడు

చప్పున కొన్ని కాయలు కోసి, "నాన్నగారు ఇలాటి కాయలను చూసి ఉండరు. వీటిని తీసుకుపోయి ఆయనకు చూపి, యువ రాజుగా అభిషేకం పొందుతాను," అంటూ తన గుర్రాన్ని ఎక్కి వెనక్కు తిరిగి వెళ్ళిపోయాడు.

ఆ పాటి ఆలోచన తనకు తట్టనందుకు వీరుడు చాలా నొచ్చుకుని, అయినా ముందు ముందు ఇంకా గొప్ప వింతలు కనబడ వచ్చు ననుకుని ముందుకే వెళ్ళాడు. శూరుడు కూడా అతనితోబాటే వెళ్ళాడు.

కొన్ని రోజులకు వారు మరొక వింత తోపు చేరుకున్నారు. అక్కడ ఒక చెట్టున బంగారు రంగుగల వెలగకాయలున్నాయి. వీరుడు కొన్ని వెలగకాయలు కోసుకుని, "నాన్నగారు ఈ వింతను ఎన్నడూ చూసి ఉండరు. వెండి నేరేడుపళ్ళ కన్న ఇవి వింతగా ఉన్నాయి. నేను తప్పక రాజు నౌతాను," అని చెప్పి వెనక్కు తిరిగి వెళ్ళిపోయాడు.

తరవాత శూరుడు ఒక్కడే ముందుకు సాగాడు. అతను చాలాకాలం ప్రయాణించి ఒక విచిత్రమైన చిట్టడవి చేరుకున్నాడు. అక్కడ ప్రతి చెట్టూ, ప్రతి పొదా, ప్రతి దుబ్బూ మణులతో చేసినట్టుగా ఉండి, ఎండలో రకరకాల రంగు లీనుతున్నది.





ఈ చిట్టడవి నట్టనడుమ ఒక బంగారు భవంతి ఉన్నది. దాని గోడల నిండా వజ్రాలు తాపడం చేసి ఉన్నాయి. భవంతి ముందు ఒక భీకరమైన ముసలిది కూర్చుని ఉన్నది. ఆమె చేతిలో ధగధగ మెరుస్తున్న ఒక పెద్ద కత్తి ఉన్నది.

శూరుడు, ఆమె తల తిప్పి, తానున్న వైపు చూసేలోగా పొదల మాటున దాక్కున్నాడు. ఇటువంటి రత్నాల అడవి తన తండ్రి చూసి ఉండడని అతనికి తోచింది. ఒక చిన్న రెమ్మగాని, కొమ్మగాని తుంపుకుని పోదామని అతను తన సమీపంలో ఉన్న పొద మీద చెయ్యి వేసేసరికి ఆ పొద బాధతో మూలిగింది. కనీసం దుబ్బు నుంచి గడ్డిపరక అయినా కోసుకుందామనుకున్నాడు. కాని ఆ దుబ్బు బలహీనంగా, "నన్ను తెంపకు, శూరా! ఇంటికి వెళ్ళు. ఇక్కడ చూసినదేదీ ఎవరికీ చెప్పకు. నీ తండ్రి దేశసంచారం చేసినప్పుడు ధరించిన దుస్తులూ, కత్తీ తీసుకుని, ఆయన ఎక్కిన గుర్రం మీద మళ్ళీరా. నీకు మేలు కలుగుతుంది," అన్నది.

శూరుడు ఆ మాటలలో విశ్వాసం ఉంచి, భయంకరమైన ముసలిదాని కంట పడకుండా చిట్టడవి నుంచి బయటపడి, తన గుర్రం మీద ఇంటిదారి పట్టాడు.

ఈ లోపల ధీరుడు ఇంటికి తిరిగి వచ్చి, వెండి నేరేడుపళ్ళు రాజుకు చూపించి, "ప్రపంచంలో కెల్లా వింత అయినవి తెచ్చాను," అన్నాడు.

"నువు ఎంతో దూరం వెళ్ళలేదురా, బాబూ. ఈ వెండి నేరేడుపళ్ళ చెట్టు మన రాజ్యం సరిహద్దు దాటి కొద్ది దూరంలోనే గదా ఉన్నది. నా చిన్నతనంలో నేనూ, నా స్నేహితుడూ ప్రతి ఉదయమూ ఈ చెట్టు గల తోపుకు షికారు వెళ్ళి వచ్చేవాళ్ళం," అన్నాడు రాజు. ఈ మాట విని ధీరుడు హతాశుడయాడు.



వీరుడు తెచ్చిన బంగారు వెలగపండు చూసి కూడా రాజు ఆశ్చర్యపడలేదు. "ప్రపంచం చూసి రమ్మని పంపితే ఇంత కొద్ది దూరం వెళ్ళి తిరిగి వచ్చావేం? ఒకప్పుడు నేనూ నా స్నేహితుడూ ప్రతి సాయంకాలమూ ఈ చెట్టు వద్దకు షికారు వెళ్ళి వచ్చేవాళ్ళం," అన్నాడాయన. దాంతో వీరుడి ఆశలన్నీ నీరుకారి పోయాయి. అంతేకాదు. తమ కన్న దూరం వెళ్ళిన శూరుడు ఏదన్నా వింత వస్తువు తెచ్చి, వాడే రాజైపోతాడేమోనని వాళ్ళు మహా భయపడ్డారు.



కాని శూరుడు వట్టి చేతులతో తిరిగి వచ్చాడు. అతను రాజుతో, "నాన్నా, నీకు తెలియని వింతలేవీ నాకు కనిపించలేదు. అయితే మళ్ళీ బయలుదేరుదా మనుకుంటు న్నాను. నువ్వు చిన్నతనంలో వాడిన దుస్తులూ, కత్తీ, నీ గుర్రమూ నాకు కావాలి," అన్నాడు.

రాజు మొదట ఆశ్చర్యపడి, తరవాత, తన చిన్ననాటి దుస్తులు చినిగిపోయాయనీ, కత్తి తుప్పుపట్టి పోయిందనీ, గుర్రం లేచి నిలబడలేనంత ముసలిదై పోయిందనీ అన్నాడు. అయినా శూరుడు వినిపించుకో లేదు. రాజు అతను కోరినవి ఇవ్వక తప్పలేదు.

శూరుడు శిథిలమై పోతున్న దుస్తులు తొడిగి, కత్తికి తుప్పు కడిగి నడుముకు కట్టుకుని, అశ్వశాలకు వెళ్లి లేవలేని స్థితిలో ఉన్న ముసలి గుర్రాన్ని చూశాడు. అతను బలవంతంగా లేవదీస్తుంటే ముసలి గుర్రం సకిలించింది. ఆ సకిలింపు వెంబడి శూరుడి కిలా మనిషి మాటలు వినిపించాయి:

"నాకు నిప్పులు పెట్టు!"

శూరుడిది విని నిర్ఘాంతపోయి, చితుకులు తెచ్చి మంట చేసి, కాలే కట్టెలు తెచ్చి గుర్రం నోట్లో పెట్టాడు. వెంటనే గుర్రం లేచి నిలబడింది. అది ఒక్కసారి మెడ విదిలించి, గిట్టలతో నేలను గోరాడింది.





పరమానందం చెంది, శూరుడు ఆ గుర్రం మీద ఎగిరి కూర్చున్నాడు. మరుక్షణమే అది వాయువేగంతో బయలుదేరి, ఆకాశ ఘడియ లోపల రత్నాల చిట్టడవి చేరి, అక్కడ ఆగింది. అది శూరుడితో, "శూరా, నువ్విప్పుడు చాలా జాగ్రత్తగా మసులు కోవాలి. ఈ చిటడవి మధ్య కూర్చుని ఉన్న ముసలిది మహా భయంకరమైన మంత్రగత్తె; దాని కంటపడితే నీ ప్రాణాలు దక్కవు. ఒకే క్షణంలో దాని చేతి కత్తి లాగేసి, దాని తల నరికెయ్యాలి. అది తన మంత్రశక్తితో ఇక్కడి రాజునూ, అతని కుమార్తెనూ, పరివారాన్నీ చెట్లుగానూ, పొదలుగానూ మార్చేసింది. అది చస్తే వాళ్ళు తిరిగి యథారూపం పొందుతారు," అని చెప్పింది.

శూరుడు ఏ మాత్రమూ జంకక, తన వెంట తెచ్చిన కత్తి చేతబట్టి, వెనక నుంచి మంత్రగత్తెను సమీపించి, ఎడమచేత్తో దాని చేతిలోని కత్తి లాగేస్తూ, కుడిచేత్తో ముసలి దాని కంఠం నరికేశాడు.

మరుక్షణం చిట్టడవి మాయమయింది. అంతటా మనుషులు వెలిశారు. వారిలో రాజూ, రాజకుమార్తే ఉన్నారు. రాజు శూరుణ్ణి చూసి, "ఎవరు, బాబూ, నువు? నువు ధరించిన దుస్తులు నా చిన్ననాటి మిత్రుడివి. నీ కెలా వచ్చాయి?" అని అడిగాడు. శూరుడి తండ్రి సుధన్వుడని తెలియగానే ఆ రాజు అతన్ని కౌగలించుకుని, "నా పేరు శ్రీపుత్రుడు. మీ నాన్న నీకు చెప్పలేదా? చిన్నతనంలో మా ఇద్దరిదీ ఒకటే ప్రాణం. నన్నూ నా రాజ్యాన్నీ గొప్ప ఆపద నుంచి కాపాడావు. ఆపైన నా ప్రాణమిత్రుడి కొడుకువు. నువు నా కుమార్తె మాలావతిని పెళ్ళి చేసుకుంటే చాలా సంతోషిస్తాను" అన్నాడు శ్రీపుత్రుడు.

శూరుడికి మాలావతిని చూసినప్పుడే ఆమె తన భార్య అయితే బాగుండు నని



కొడుకు. వాళ్ళ చేతులు చూసి ఎవరు ఎవరి కొడుకో, నా కొడుకు ఎవరో చెప్ప గలవా? ఎందుకంటే, వీళ్ళలో ఒకణ్ణి యువరాజు చెయ్యాలి," అన్నాడు.

బోయవాడు ముగ్గురు రాజకుమారుల చేతులూ చూసి, ఏకాంతంగా రాజుతో, "ధీరు డనే పేరుగలాయన మీకు పుట్టిన వాడు. శూరుడనే ఆయన దాసీకి పుట్టిన వాడు. వీరుడు వంటలక్క కొడుకు," అని చెప్పాడు.

రాజు హతాశుడైనాడు. ముగ్గురిలోకీ సోమరిపోతూ, అసమర్థుడూ అయినవాడు తన కొడుకా? అందరిలోకీ చురుకైనవాడు దాసీ పుత్రుడా? అయినా తన కొడుకుకు రాజ్యం ఇవ్వక తప్పదు. అందుచేత ఆయన ధీరుణ్ణి రాత్రివేళ రహస్యంగా పిలిపించి, "అశ్వశాలలో నా చిన్ననాటి గుర్రం ఉన్నది. దాన్ని చక్కగా మాలిస్ చేయించి, దాని మీద ఎక్కి, అది ఎక్కడికి తీసుకుపోతే అక్కడికి వెళ్ళు," అన్నాడు.

"ఆ ముసలితట్టా?" అన్నాడు ధీరుడు చీదరగా.

"అవునురా. అదే మన శూరుణ్ణి ఎంతో దూరం తీసుకు పోయింది," అన్నాడు రాజు.

ధీరుడు వెళ్ళి చూసేసరికి ఆ గుర్రం లేవ లేని స్థితిలో ఉన్నది. "లేస్తావా, లేవవా?" అని అతను దాన్ని కొట్టుతూండగా శూరుడు వచ్చి, "దాన్ని ఎందుకలా చావగొడు తున్నావు?" అన్నాడు.

"నాన్న దీన్ని ఎక్కి పొమ్మన్నాడు. ఇది లేచి నిలబడకుండా ఉన్నది," అన్నాడు ధీరుడు. మాలావతిని తాను చేసుకోవటం రాజుకు ఇష్టం లేదని గ్రహించి శూరుడు, "అలా అయితే, దానికి నిప్పు పెట్టు," అన్నాడు ధీరుడితో.

అలా చేసేసరికి గుర్రం, బలం వచ్చి, లేచి నిలబడింది. ధీరుడు దానిమీద ఎక్కి, వాయువేగంతో శ్రీపుత్రుడి నగరం చేరాడు.

శ్రీపుత్రుడు అతన్ని చూసి శూరుడే అనుకుని, "తిరిగి వచ్చావా? మీ తండ్రి నీ పెళ్ళికి ఒప్పుకున్నా డన్నమాట! ఉంగరం ఇచ్చెయ్యి," అన్నాడు.

"ఏం ఉంగరం? నేను ఉంగరం మాట ఎరగనే?" అన్నాడు ధీరుడు.

"మీ తండ్రికి చూపమని నేను నీకు ఉంగరం ఇస్తినే?" అన్నాడు రాజు.

"నాకు మీరు ఉంగరం ఎప్పుడు ఇచ్చారు?" అన్నాడు ధీరుడు.

అతను శూరుడు కాదని శ్రీపుత్రుడు గ్రహించి, అతన్ని వెంటనే నిర్బంధంలో పెట్టించాడు. ధీరు డెక్కిన గుర్రం మాత్రం తిరిగి వచ్చింది.

ధీరుడి కేదో అపద జరిగినట్టు రాజు గ్రహించి, శూరుణ్ణి పిలిచి, అతనికి జరిగిన దంతా చెప్పి, "మీలో ధీరుడు ఒక్కడే నిజంగా నా కొడుకు. వాడి కేదో అపద జరిగింది. నువే వాణ్ణి కాపాడాలి," అన్నాడు.

శూరుడు రాజు పాదాలు అంటుకుని, "నేను దాసీదాని కొడుకునై ఉండి కూడా, మీ దయవల్ల రాజకుమారుడి లాగా పెరిగాను. మీ రుణం ఎలా తీరుతుంది! నేను ధీరుణ్ణి క్షేమంగా పంపేస్తాను. నాకు సెలవు ఇవ్వండి," అన్నాడు.

అతను గుర్రం మీద శ్రీపుత్రుడి రాజ్యం చేరి, "ఇదుగో, మీ రిచ్చిన ఉంగరం," అంటూ ఆయన ఉంగరాన్ని తిరిగి ఇచ్చాడు.

"ఇంతకు ముందు నా ఉంగరం మాట ఎరగనన్నందుకు నిర్బంధంలో పెట్టినది నిన్ను కాదా?" అన్నాడు శ్రీపుత్రుడు.

"కాదు. అతను ధీరుడు. అతనూ, నేనూ ఒక పోలికగానే ఉంటాం," అన్నాడు శూరుడు.

శ్రీపుత్రుడు ధీరుణ్ణి నిర్బంధం నుంచి విడుదల చేశాడు. అతను తన తండ్రి వద్దకు తిరిగి వెళ్ళిపోయాడు. శూరుడికీ, మాలావతికీ వివాహం సక్రమంగా జరిగింది.






# కొత్తకోడలి పాట్లు

పూర్వకాలం చీనాదేశంలో కూడా అత్త పోరు కోడళ్ళకు దుర్భరంగా ఉండేది. కోడళ్ళ మీద కోపం వస్తే అత్తలు వాళ్ళను చిత్రహింసలు చేసేవారు.

ఒక కొండప్రాంతంలో ఒక కుటుంబం ఉండేది. ఆ కుటుంబంవాళ్ళు తమ రెండో కొడుక్కు చేసుకుందామని ఒక అమ్మాయిని తెచ్చుకున్నారు. ఆ కాబోయే కోడలి చేత అత్తగారు అంతులేని చాకిరి చేయించేది.

వాళ్ళ దొడ్లో ఒక విచిత్రమైన చెట్టుండేది. దాని ఆకులు ఎన్నడూ పండేవి కావు. ప్రతి ఉదయమూ ఆ చెట్టు నుంచి గుండ్రని రాగి బిళ్ళలు రాలి పడేవి. రాగిబిళ్ళల మధ్య రంధ్రాలు పొడిచి, తాడు గుచ్చి, వాటిని డబ్బుగా వాడటం చీనాదేశీయుల ఆచారం.

ఈ కుటుంబంవాళ్లు తమకు అయాచితంగా దొరికే ఈ రాగిబిళ్ళలను డబ్బుగా వాడేవారు.

చెట్టు నుంచి రాలిన రాగిబిళ్ళలకు రంధ్రాలు చెయ్యటం కాబోయే కోడలుకు అప్పగించారు. అది చాలా కష్టమైన పని. సుత్తెతో పనిచేసి ఆమెకు చేతులు బొబ్బలెక్కాయి. తెల్లవారే లోపలనే డబ్బులు తయారుచేసి, పగలల్లా ఆమె ఇంటెడు చాకిరీ చేసేది. ఆ పనులన్నిటిలోకీ కష్టమైనది కొండ ఎక్కి, గొడ్డలితో కట్టెలు కొట్టి తీసుకు రావటం. కొండ మీద చలి జాస్తిగా ఉండేది.

ఈ కష్టాలు పడలేక ఆమె కొండ మీద ఒంటిగా కూర్చుని ఏడ్చేది. ఒక ఉదయం ఆమె ఇలాగే ఏడుస్తుంటే ఒక ముసలివాడు అటుగా వచ్చి, ఎందు కేడుస్తున్నావని అడిగాడు. ఆమె అతనితో తన కష్టాలన్నీ చెప్పుకున్నది.

"ఆ కొండ కొసన రాతిమనిషి బొమ్మ చూశావా? ఆ మనిషి చెయ్యి మీ అత్త



వారి దొడ్లో ఉన్న చెట్టు కేసి చూపిస్తున్నది. ఆ చెయ్యి విరగ గొట్టావంటే, రాగిబిళ్ళలు రాల్చే చెట్టు కాస్తా చచ్చిపోతుంది. నీ కష్టాలు సగం విరగడ అయిపోతాయి,'' అన్నాడు ముసలివాడు.

ఆమెకు ప్రాణం లేచి వచ్చినట్టయింది. ఆమె రాతివిగ్రహాన్ని వెతుక్కుంటూ వెళ్ళి, దాని చెయ్యి ఒక్క దెబ్బతో విరగగొట్టింది. ఆమె ఇల్లు చేరేసరికే చెట్టు వాడిపోయి చావుముఖం పట్టింది.

కాబోయే కోడలు ఇంతపని చేసిందని తెలిసి అత్తగారు, ''పాపిష్టిదానా, నిక్షేపం లాటి చెట్టు ప్రాణాలు నిలువునా తీశావా? నీ ప్రాణాలు నేను తీస్తానుండు,'' అంటూ మడ్డుకత్తి పట్టుకుని కోడలి మీదికి వచ్చింది. కోడలు బెదిరిపోయి కొండ మీదికి పారిపోయింది. అత్తగారు చాలా దూరం ఆమె వెంటపడింది గాని, అందుకో లేక వెనక్కు తిరిగి వచ్చేసింది.




ఇక కోడలుకు ఏం చెయ్యాలో తోచలేదు. ఇంటికి పోతే అత్తగారు ప్రాణాలు తీస్తుంది. అందుచేత ఆమె కొండల మీదనే ఉండి పోయి, ఆకలి తీర్చుకోవటానికి దేవదారు చిగుళ్ళు తినసాగింది. ఇందువల్ల ఆమెలో ఒక విచిత్రమైన మార్పు వచ్చింది. ఆమె శరీరమంతటా తెల్లని ఈకలు పుట్టుకొచ్చాయి; వీటి సహాయంతో ఆమె ఎగరగలిగింది.

కొండల దిగువన ఒక దేవాలయం ముందు ఒక ఎత్తయిన దేవదారువృక్షం ఉన్నది. కాబోయే కోడలు ఆ చెట్టు మీద తన నివాసం ఏర్పాటు చేసుకుని, దాని చిగుళ్ళు తింటూ కాలం గడప సాగింది. దేవాలయం ఆవరణలో ఒక మఠం ఉన్నది. ఆ మఠంలో ఉండే భిక్షువు ఒకడు, మనిషి ఆకారం ఒకటి చెట్టు మీదికి వాలటం చూశాడు. ఆ ఆకారం ఏమిటో తెలుసుకుందామని ఒక రాత్రి వేడివేడి వంటకాలు



తెచ్చి, దేవదారువృక్షం కింద ఉండే అరుగు మీద ఉంచి, ఎడంగా వెళ్ళి దాక్కున్నాడు.

కాబోయే కోడలు మనుషులు తినే ఆహారం కోసం తహతహలాడుతున్నది. సమీపంలో ఎవరూలేరని తోచి ఆమె చెట్టుకింద ఉన్న అరుగు మీద వాలి, భిక్షువు ఉంచిన ఆహారాన్ని ఆవురావురుమని తినసాగింది.

చాటుగా ఉండి చూస్తున్న భిక్షువుకు ఆ తెల్లటి ఆకారం ఏదో పిశాచమని అనుమానం కలిగింది. అతను పిశాచమంత్రాలు చదువుకుని ముందుకు వచ్చి, "పిశాచమా, ఎవరు నువ్వు?" అని అడిగాడు.

కాబోయే కోడలు బెదిరి ఎగరటానికి ప్రయత్నించింది, కాని ఎగరలేక పోయింది. మనుషులు తినే తిండి తినటం చేత ఆమెకు ఎగిరే శక్తి పోయింది. అందుచేత ఆమె ఏడుస్తూ, "నేను ఫలానివారి కాబోయే కోడల్ని," అంటూ తనను అత్తగారు పెట్టిన కష్టాలన్నీ భిక్షువుతో చెప్పుకున్నది.

మాట్లాడుతూండగానే ఆమె శరీరం మీద మొలిచిన ఈకలన్నీ రాలిపోయి మామూలు మనిషి అయింది.

"నీకు వచ్చిన భయ మేమీ లేదు. నీ అత్తగారు నిన్నేమీ అనకుండా నేను చూస్తాను," అని ఆ భిక్షువు ఆమెను వెంట బెట్టుకుని ఆమె అత్తవారింటికి వెళ్ళి, "నీ కోడలిని కాస్త మర్యాదగా చూడు. ఆమె స్వతహాగా చాలా మంచిది. కాని కష్టాలు జాస్తిగా పెట్టితే పిశాచంగా మారిపోతుంది. ఆమె ఆకాశంలో ఎగరటం నేను కళ్ళారా చూశాను," అన్నాడు.

అత్తగారికి పిశాచాల పేరు చెబితేనే భయం. తన కాబోయే కోడలును ఇంట్లో నుంచి వెళ్ళగొట్టే ధైర్యం కూడా అమెకు లేకపోయింది. మంచి ముహూర్తం చూసి తన రెండో కొడుక్కు ఆ పిల్లను పెళ్ళి చేసి, ఆమె అంటే ఎంతో భయభక్తులతో ఉంటూ వచ్చింది.





# యశస్కరుడి న్యాయనిర్ణయం

ఒకరోజు యశస్కరుడు సభ పూర్తి చేసి, భోజనానికి లేవబోతూండగా ఒక బ్రాహ్మణుడు వచ్చి రాజదర్శనం కోరాడు.

"మహారాజుగారు ఈ రోజుకు పని ముగించారు. రేపు వచ్చి ఏమైనా ఉంటే విన్నవించుకో," అన్నాడు ద్వారపాలకుడు.

ఈ మాట విని రాజు, వంటవాణ్ణి కొంచెం ఆగమని, బ్రాహ్మణ్ణి లోపలికి పిలిపించి, వచ్చిన కారణమడిగాడు.

బ్రాహ్మణుడు దుఃఖం పొంగుకొస్తూ ఇలా చెప్పాడు :

"మహారాజా, నానా దేశాలు తిరిగి నూరు బంగారు మాడలు సంపాదించు కున్నాను. నా దేశంలో అరాజక పరిస్థితి తొలగి పోయిందని విని తిరిగి వచ్చాను. తమ దయవల్ల దారిలో నాకు ఎలాటి దొంగల భయమూ కలగలేదు. నిన్న సాయంకాలం లవనోత్స చేరుకుని, ప్రయాణపు బడలికవల్ల అక్కడే రాత్రి విశ్రాంతి తీసుకుని, రహదారి పక్కనే ఉన్న ఒక తోటలో చెట్టు కింద పడుకుని నిద్రపోయాను. తెల్లవారి లేచేటప్పుడు నా డబ్బు సంచీ ఒక బావిలో పడిపోయింది. ఆ బావిపైన లతలు పెనవేసుకుని ఉంటడం చేత అక్కడ బావి ఉన్నట్టే తెలియరాలేదు. నా కున్నదంతా పోగొట్టుకుని, బావిలోకి దిగటం చాతకాక అలమటిస్తూండగా ఒకడు వచ్చి, 'నీ డబ్బు సంచీ నీకు తీసి ఇస్తాను. నా కేమిస్తావు?' అని అడిగాడు. 'దుస్థితిలో ఉన్న నేను ఆ డబ్బంతా నాదే నని ఎలా చెప్పగలను ? అందులో నీకు ఇష్టమైనంత నా కియ్యి,' అన్నాను. వాడు బావిలోకి దిగి నా సంచీ తీసి, అందులోనుంచి నాకు రెండు మాడలు మాత్రమే ఇచ్చి మిగిలినవి తాను ఉంచుకున్నాడు. నేను అభ్యంతరం చెబితే, అక్కడ చేరినవాళ్ళు నన్ను మందలించి, 'యశస్కరుడి రాజ్యంలో ఒప్పందం అత

రాలా అమలు జరగవలిసిందే,' అన్నారు. మర్యాదగా మాట్లాడినందుకు నాకు ఘోర మైన అన్యాయం జరిగింది. మీ పాలనలో న్యాయం ఇలాగే ఉండే పక్షంలో మీ ఇంటి ముందు ప్రాయోపవేశం తప్ప నాకు గత్యం తరం లేదు."

"ఆ మనిషి పేరేమిటి? ఏం చేస్తూం టాడు?" అని రాజు అడిగాడు.

"నాకు అతని ముఖం తప్ప ఏమీ తెలీదు," అన్నాడు బ్రాహ్మణుడు.

"నీ సంగతి రేపు నేను చూస్తాను. ఈ పూటకు నాతో బాటు భోజనం చేసి, ఇక్కడే విశ్రాంతి తీసుకో," అన్నాడు రాజు.

మర్నాడు రాజుగారు కబురు చెయ్యగా లవనోత్సలో ఉన్నవారంతా వచ్చారు. బ్రాహ్మణుడు తన మనిషిని గుర్తించాడు. అతడూ బ్రాహ్మడు చెప్పినదే చెప్పాడు.

ఫిర్యాదీ, ముద్దాయి కూడా ఒకే మాట చెప్పిన మీదట రాజుగారు పరిష్కారం ఎలా చెయ్యగలరో సభికులకు ఏమీ అర్థం కాలేదు. కాని రాజుగారు తీర్పు చెబుతూ, "బ్రాహ్మడికి తొంభైఎనిమిది మాడ లిచ్చి ముద్దాయి రెండు మాడలు మాత్రమే తీసుకోవాలి," అన్నాడు.

కొందరు సభికులు దీనికి అభ్యంతరం చెప్పారు. రాజు వారితో ఇలా అన్నాడు: "ఒక్కొక్కసారి న్యాయమూ, అన్యాయమూ ఒకే లాగుంటాయి. వాటిని వేరు చేసి చూడాలి. ఈ బ్రాహ్మడు, 'నువ్విచ్చినంత పుచ్చుకుంటాను' అనలేదు; 'నీ కిష్ట మైనంత ఇయ్యి,' అన్నాడు. దురాశాపరుడు తన కిష్టమైనంత తానుంచుకుని, తన కిష్టం లేని రెండు మాడలూ ఇచ్చి, అనుకున్న నియమాన్ని ఉల్లంఘించాడు," అన్నాడు.

యశస్కరుడు ఇలా ఎన్నో సందర్భాలలో ఎంతో నేర్పుగా న్యాయాన్యాయ విచక్షణ చేసి, భూమి మీద మళ్ళీ కృతయుగాన్ని ప్రారంభించాడని కీర్తి తెచ్చుకున్నాడు.





# సలహా ఆంతర్యం

పూర్వం పారశీకదేశాన్ని ఒక పాదుషా పరిపాలించేవాడు. అతను బుద్ధిచాతుర్యమూ, విచక్షణాజ్ఞానమూ గలవాడు. అతని వద్ద ఫారూన్, కమాల్ అనే ఇద్దరు ఆంతరంగిక సలహాదార్లు ఉండేవారు.

ఫారూన్ కమాల్ కన్న ప్రజ్ఞాశాలి. ఆ సంగతి పాదుషా దగ్గిర అతడు నిరూపించి ఉండటంచేత కమాల్‌కు అతనంటే అసూయా, ద్వేషమూనూ.

ఫారూన్ పాదుషా వద్ద అనేక ప్రశంసలూ, బహుమానాలూ పొంది చాలా ఉన్నత స్థానంలో ఉన్నాడు.

ఫారూన్‌ను ఎలాగైనా పాదుషా నుంచి దూరం చెయ్యాలని కమాల్‌కు దురాలోచన కలిగింది. తనదారికి ఫారూన్ అడ్డు తొలగితే తన ప్రజ్ఞాప్రాభవాలు రాణిస్తాయనీ, ఎంతో కీర్తిప్రతిష్ఠలు సంపాయించవచ్చుననీ అతనికి గట్టి నమ్మకం ఏర్పడింది.

ఫారూన్ అంటే పాదుషాకే గాక రాజసభలో అందరికీ ఎంతో గౌరవాదరాలున్నాయి. అతను దయాహృదయుడు, పాపభీతిగలవాడు, సజ్జనుడు. అందుచేత అతనిపై కుట్రలూ, కుహకాలూ పని చెయ్యవు. ఏదో అవకాశం చూసి, ఎంతో నేర్పుగా ఫారూన్‌పై పాదుషా మనసు విరిగేలాగు చెయ్యాలి.

ఇలాంటి అవకాశం కోసం కమాల్ కనిపెట్టుకుని ఉన్నాడు. అలాటి అవకాశం ఒకనాడు వచ్చింది.

రాజభటులు ఒక ఖైదీని రాజభవనానికి ఈడ్చుకొచ్చారు. అతనిపై హత్యానేరం ఆరోపించబడింది. పాదుషా సభికుల సమక్షంలో విచారణ జరిపి, ఆ మనిషికి మరణదండన విధించాడు.

దిక్కులేని ఆ హతభాగ్యుడు, నిరాశతో కుమిలిపోతూ, పాదుషాను నోటికి వచ్చినట్టు

ఎస్. అబ్దుల్ వహాబ్, బి. యస్సి.

తిట్టుతున్నాడు. ప్రాణాలపై ఆశవదులు కున్న వాడికి భయమేమిటి?

నిందితుడు అనే మాటలు పాదుషాకు వినిపించలేదు.

"ఏమిటి, ఆ నేరస్థుడు-అనేది?" అని ఆయన తన సమీపంలో ఉన్న ఫారూస్‌ను అడిగాడు.

ఫారూస్ లేచి నిలబడి, "మహాప్రభూ, కరుణచూపి, దీనులను మన్నించే వారిని పరాత్పరుడు ప్రేమిస్తాడని ఆ మనిషి అంటున్నాడు. తాను నిరపరాధిననీ, తన శిరశ్ఛేదం ఒక్క క్షణం పట్టదుగాని, ఆ పాపం తమని శాశ్వతంగా వెంటాడుతుందనీ అంటున్నాడు," అన్నాడు.

పాదుషాకు ఆ అభాగ్యుడిపై జాలికలిగి, ఉదారహృదయంతో వాణ్ణి మన్నించి, తన శిక్ష ఉపసంహరించాడు.

కమాల్‌కు పెన్నిధి దొరికినట్టయింది. మిత్రభేదం కలిగించటానికి మంచి అవకాశం చిక్కింది. అతను లేచి నిలబడి, అతి వినయంగా, "జగత్ప్రభూ! నాది తమ ఉప్పు తిని పెరిగిన శరీరం. నాబోటివాడు తమ వద్ద నిజం తప్ప పలకకూడదు. ఆ ధూర్తుడు తమని అనేక దుర్భాషలాడి, దేవుడికి ప్రతిరూపమైన తమను ఎంతగానో అవమానించాడు. వాడి నాలుక చీల్పించమని నా ప్రార్థన," అన్నాడు.

పాదుషా ముఖం జేవురించింది. అతను కమాల్ నుద్దేశించి కఠినంగా, "నువు చెప్పిన నిజంకంటె ఫారూస్ చెప్పిన అబద్ధం నాకు ప్రియంగా ఉన్నది. అతను సద్బుద్ధితో అబద్ధం చెప్పాడు. ఈర్ష్యాద్వేషాలతో చెప్పిన నీ నిజం ఎంతమాత్రమూ నాకు హితం కాదు," అన్నాడు.

కమాల్ నెత్తిన పిడుగు పడ్డట్టయింది. అతను తలవంచుకుని సభ నుంచి బయటికి పోయి, మర్నాడే దేశం కూడా విడిచి వెళ్ళిపోయాడు.






తన భార్యలైన కుంతినీ, మాద్రినీ వెంట బెట్టుకుని అరణ్యాలలో విహరిస్తూ, మృగాలను వేటాడటంలో పొద్దు పుచ్చుతున్న పాండురాజు ఒకనాడు కలిసి ఉన్న లేళ్ళ మిధునాన్ని కొట్టాడు. అవి నిజానికి లేళ్ళు కావు; కిందము డనే మునీ, ఆయన భార్యా లేళ్ళరూపం ధరించి కామసుఖం అనుభవిస్తున్నారు. చచ్చిపోతూ ఆ ముని, "నీవు నీ భార్యలతో కూడినప్పుడు నీకు కూడా మరణం సంభవించును గాక," అని శపించాడు.

ఆ మునిదంపతులను చంపినందుకు పాండురాజు చాలా విచారించాడు. అప్పటికింకా అతనికి సంతానం లేదు. ఇక ముందు మునిశాపం వల్ల సంతానం కలిగే అవకాశం కూడా లేకుండా పోయింది. ఆయన తన భార్యలతో, తాను సన్యాసం పుచ్చుకుని అరణ్యావాసం చేస్తాననీ, వాళ్ళు హస్తినాపురానికి తిరిగి వెళ్ళి, భీష్మ ధృతరాష్ట్ర విదురులకూ, మిగిలిన వారికీ ఈ విషయం చెప్పవలిసిందనీ అన్నాడు.

"నీ భార్యలమైన మేము ఎక్కడికి పోతాం? ఎక్కడ ఉంటాం? అందరమూ కలిసే తపస్సు చేసి, ఆయువు తీరినాక పుణ్యలోకాలకు పోదాం," అన్నారు కుంతీ మాద్రిలు. అందుకు పాండురాజు ఒప్పని పక్షంలో అప్పటికప్పుడే దేహత్యాగం చెయ్యటానికి కూడా వాళ్ళు సిద్ధపడ్డారు.

వాళ్ళ మాట కాదనలేక పాండురాజు, వారిద్దరినీ తన వెంటనే ఉండనిచ్చి వాన





అయితే అతని కొక అనుమానం కలి గింది. పుత్రులు లేనివాడికి, ఎంత తపస్సు చేసినా, పుణ్యలోకాలు లభించవు. తనకు సంతానప్రాప్తి లేదు. తనతో సమానులు గాని, తన కన్న ఉత్తములు గాని అయిన వాళ్ళకు తన భార్యలు కొడుకులను కంటే, వాళ్ళు తనకు క్షేత్రజులైన కొడుకులు అవుతారు. తాను కూడా క్షేత్రజుడే గద. ఈ విధంగా అనుకుని పాండురాజు తన అభిప్రాయాన్ని కుంతికి చెప్పాడు. ఇతరుల వల్ల కొడుకును కనటానికి ఆమె మొదట సమ్మతించలేదు. కాని పాండురాజు ఆమెను చివరకు ఒప్పించాడు.

కుంతి తన భర్తతో, "నాకు చిన్న తనంలో దుర్వాసమహాముని ఒక మంత్రం ఉపదేశించాడు. దాన్ని జపించినట్టయితే నేను తలచిన ఏ దేవత అయినా సరే వచ్చి నాకు పుత్రప్రాప్తి కలిగించగలడు. నేను ఏ దేవతను స్మరించను?" అన్నది.

"మరీ మంచిది. కౌరవవంశానికి రాజు కాబోయేవాడు గొప్ప ధర్మజ్ఞుడై ఉండటం అవసరం. అందుచేత నువు ధర్మదేవతను స్మరించు," అన్నాడు పాండురాజు.

ఆమె అలాగే చేసి, యముణ్ణి ప్రత్యక్షం చేసుకుని, అతని అనుగ్రహం వల్ల గర్భవతి

ప్రస్థం చెయ్య నిశ్చయించాడు. ముగ్గురూ విలువగల తమ వస్త్రాలనూ, ఆభరణా లనూ విసర్జించి నారబట్టలు కట్టుకున్నారు. తమ వెంట ఉన్న పరిచారకులను హస్తినా పురానికి పంపేశారు. వాళ్ళు దేశాటన చేస్తూ నాగశతపర్వతమూ, చైత్రరథమూ, కాల కూటమూ, హిమవంతమూ, గంథమాద నమూ, ఇంద్రద్యుమ్నహ్రదమూ, హంస కూటమూ తిరిగి, అక్కడక్కడా కొద్ది కొద్ది రోజులుండి, శతశృంగపర్వతం చేరారు. అక్కడ అనేకమంది మునులున్నారు. పాండురాజు వారితో కలిసి తాను కూడా తపస్సు చేయసాగాడు.



అయింది. గాంధారి అప్పటికే ఒక సంవత్సరం నుంచీ గర్భవతిగా ఉంటున్నది. కాని గాంధారి ఇంకా గర్భిణిగా ఉండగానే కుంతికి కొడుకు కలిగాడు. ఆశ్రమంలో ఉంటున్న మునులు ఆ పిల్లవాడికి యుధిష్ఠిరుడని నామకరణం చేశారు.

తరవాత కుంతి, బలశాలి అయిన కొడుకు కావాలని భర్త కోరిన మీదట, వాయుదేవుడికి భీముణ్ణి కన్నది. భీముడు పుట్టుతూనే ఒక వింత జరిగింది. కుంతి ఆ బిడ్డను తన ఒడిలో పెట్టుకుని కూర్చుని వుండగా, ఆ ప్రాంతాలకు ఒక పెద్దపులి వచ్చింది. దాన్ని చూసి కుంతి భయపడి, తన ఒడిలో బిడ్డ ఉన్న సంగతి కూడా మరిచిపోయి, చివాలున లేచింది. బిడ్డ ఒక రాతి మీద పడ్డాడు. వెంటనే ఆ రాయి నాలుగుగా పగిలింది. అది చూసి అక్కడి వాళ్ళంతా దిగ్భ్రమ చెందారు. ఇది జరిగాకనే ఆ బిడ్డకు మునులు భీమసేనుడన్న పేరు పెట్టారు.

పాండురాజుకు లోకోత్తరుడైన మరొక కొడుకుని కూడా కనాలనిపించింది. ఆయన కోరికపై ఇంద్రుడి ద్వారా కుంతి అర్జునుణ్ణి కన్నది. హస్తినాపురంలో గాంధారి నూరుగురు కొడుకులను కంటే, శతశృంగంలో కుంతి ముగ్గురు కొడుకులను కన్నది.





పాండురాజుకు కుంతి చేత ఇంకా కొడుకులను కనిపించాలని ఉన్నది. కాని ఆమె అందు కెంతమాత్రమూ ఒప్పుకోలేదు.

అయితే మాద్రి ఆయనతో, 'కుంతి మంత్ర ప్రభావంతో కొడుకులను కన్నది కదా, కుంతితో సమానురాలనైన నేను సంతానం లేకుండా ఎందుకుండాలి? కుంతి నా కా మంత్రం ఉపదేశించినట్టయితే నేను కూడా పుత్రవతి నౌతాను గదా," అన్నది.

ఆమె కోరికను పాండురాజు కుంతికి తెలిపాడు. కుంతి మాద్రికి మంత్రం ఉపదేశించింది. మాద్రి అశ్వనీదేవతల నారాధించి, వారి ద్వారా నకుల సహదేవు లనే కవల పిల్లలను కన్నది. మాద్రి మంత్ర ప్రభావంతో ఇంకా పిల్లలను కనేదే, కాని ఆమె ఒకేసారి ఇద్దరు దేవతలను ఆహ్వానించిందని అలిగి, కుంతి ఆ మంత్రాన్ని మాద్రికి మరి ఉపదేశించ నన్నది.

ఒక్కొక్క యేడాది తేడాగా పుట్టిన బిడ్డల ముద్దు ముచ్చట్లు చూసుకుంటూ పాండురాజు కొంతకాలం గడిపాడు. ఆశ్రమ వాసులందరూ ఆ పిల్లల పెంపకంలో శ్రద్ధ చూపారు. వసుదేవుడు తన పురోహితుడైన కశ్యపు డనే బ్రాహ్మణుడి ద్వారా తన మేనల్లుళ్ళకు బంగారు నగలూ, పట్టు బట్టలూ, ఆటబొమ్మలూ, ఇతర వస్తువులూ పంపాడు. పాండురాజు తన పిల్లలకు చౌలమూ, ఉపనయనమూ మొదలైనవి చేయించి, అక్కడి రుషుల చేత వేదాధ్యయనం చేయించాడు.

ఇలా కొంతకాలం జరిగినాక ఒక వసంత కాలంలో, కుంతి బ్రాహ్మణ సమారాధనలో మునిగి ఉన్న సమయంలో పాండురాజు, ఒంటరిగా ఉన్న మాద్రిని చూసి కామమోహితుడై, ఆమెను కలిసి, కిందముడి శాపం తగిలి చనిపోయాడు.

చచ్చిపోయిన తన భర్తను కౌగలించుకుని మాద్రి ఏడుస్తూండటం విని కుంతీ,



పాండవులూ, శతశృంగంలో ఉండే మునులూ వచ్చి, జరిగినదానికి ఆశ్చర్య పోయారు. మాద్రి కుంతిని దగ్గిరికి పిలిచి, పాండురాజు మరణానికి కారణం చెప్పింది.

"అయ్యో, మాద్రీ! రాజుకు ముని శాపం ఉందని తెలిసి, నేనెంతో జాగ్రత్త పడుతూ వచ్చాను గదా, ఇలా ఎందుకు జరగనిచ్చావు? ఇప్పుడు చేసేదేముంది? పెద్ద భార్యను గనక నేను సహగమనం చేస్తాను. నువు పిల్లలను దగ్గిర పెట్టుకుని పెంచు," అన్నది కుంతి.

మాద్రి ఏడుస్తూ, "నేను ఎంత ప్రయత్నించి కూడా భర్తను నిరోధించలేక పోయాను. భర్త ప్రాణాలు కాపాడుకోలేని దాన్ని, ఈ పిల్లలను నేనేం కాపాడగలను? ఈ లోకంలో భర్తను సుఖపెట్టలేక పోయినందుకు, మరో లోకంలో నైనా సుఖపెట్ట గలనేమో, భర్త వెంట నేనే పోతాను," అని కుంతి వద్ద సెలవు పుచ్చుకుని, భర్త చితి మీద తాను కూడా కాలి పోయింది.

తరవాత శతశృంగంలో ఉండే మునులు కుంతినీ, పాండవులనూ వెంటబెట్టుకుని, మాద్రీ పాండురాజుల అస్థికలను తీసుకుని హస్తినాపురం చేరి, జరిగినదంతా భీష్ముడు,



ధృతరాష్ట్రుడు మొదలైన కౌరవముఖ్యులందరికీ చెప్పారు.

పాండురాజు పోయాడని విని భీష్ముడూ, ధృతరాష్ట్రుడూ చాలా దుఃఖించారు. ధృతరాష్ట్రుడు విదురుడితో, చనిపోయినవారికి యథావిధిగా పరలోక క్రియలు జరిపించమని చెప్పాడు. మాద్రీ పాండురాజుల అస్థికలను పల్లకిలో ఉంచి, ఛత్రచామర లాంఛనాలతో ఊరేగించి, గంగలో కలిపారు. నగరంలో నుంచి అసంఖ్యాకులు వాటివెంట గంగాతీరం చేరారు. పన్నెండు రోజులపాటు అపరక్రియలు జరిగిన మీదట అందరూ నగరానికి తిరిగి వచ్చారు.



సత్యవతి వ్యాసుడి సలహా ననుసరించి, తన కోడళ్ళయిన అంబికా, అంబాలికలను వెంటబెట్టుకుని, తపస్సు చెయ్యటానికి అరణ్యాలకు బయలుదేరి పోయింది. అక్కడే తపస్సు చేసుకుంటూ ఆ ముగ్గురూ జీవితాలు ముగించారు.

అది మొదలు పాండవులూ, కౌరవులూ ధృతరాష్ట్రుడి వద్దనే పెరిగారు. అందరూ కలిసి ఆడుకునేవారు, ఒకరితో ఒకరు పందాలు పడేవారు. అన్ని ఆటలలోనూ భీముడిదే పై చెయ్యిగా ఉండేది. అతను తన బలం చూపటానికి ఒక్కసారిగా పది మందిని ఎత్తుకుని పరుగులు తీసేవాడు;



కోపం వస్తే అవతలివాళ్ళ జుట్టు పట్టుకుని, పదిలేవాడు కాడు; ఈతలు కొట్టేటప్పుడు పది పన్నెండు మందిని ఒకేసారి నీటిలో అదిమి పెట్టేవాడు; పిల్లలు పళ్ళ కోసం చెట్లెక్కితే మాను పట్టి ఊపి, వేళ్ళతో సహా చెట్టును కూలదోయ జూసేవాడు; కింద పడిపోతామని చెట్టు మీది పిల్లలు హడిలి చచ్చేవాళ్ళు. భీముడి కిలా చెయ్యటంలో దుర్బుద్ధి ఏమీ లేకపోయినా, అతని చెలగాటం మిగిలిన వాళ్ళకు ప్రాణసంకటంగా ఉండేది. భీముడి అపారబలం చూస్తే దుర్యోధనుడికి మహా ఈర్ష్యగా ఉండేది. ఆ భీముడు ఒక్కడూ చస్తే, మిగిలిన వాళ్ళంతా తాను చెప్పినట్టు వింటారన్న దురాలోచన అతనికి కలిగింది. అందుకు తగిన అవకాశమే త్వరగా చిక్కలేదు.

గంగాతీరాన ప్రమాణకోటిస్థల మనే చోటున్నది. అక్కడ జలక్రీడలు జరపటానికి అనుకూలంగా, నాలుగువైపులా మెట్లుగల క్రీడా సరస్సులూ, ఉద్యాన వనాలూ, ఎత్తయిన మేడలూ మొదలైనవి దుర్యోధనుడు కట్టించుకుని ఉన్నాడు. ఒక రోజు రాజకుమారు లందరూ అక్కడికి వెళ్ళి విహరించటానికి నిర్ణయం జరిగింది. రకరకాల భక్ష్యాలూ, భోజ్యాలూ, పానీ

యాలూ మొదలైనవి తయారయాయి. వాటిని సేవకులు ప్రమాణకోటిస్థలానికి తీసుకుపోయారు.

రాజకుమారులతో కలిసి పాండవులు కూడా విహారానికి వెళ్ళారు. తెచ్చిన ఆహార పదార్థాలను అందరితోబాటు పాండవులు కూడా తిన్నారు. అయితే దుర్యోధనుడు భీముడి పక్కన చేరి, ఎంతో ప్రేమగా కబుర్లు చెబుతూ అతని చేత విషం కలిపిన భక్ష్యాలు తినిపించాడు. భీముడికి ఏ మాత్రమూ అనుమానం కలగలేదు. అతను మిగిలిన వాళ్ళతోబాటు జలక్రీడలాడి, విషం పనిచెయ్యనారంభించేసరికి వికారం పుట్టి, గంగాతీరాన చల్లగాలి కొట్టే చోట పడుకుని, స్పృహ తప్పిపోయాడు.

తన ఎత్తు పారినందుకు సంతోషించి దుర్యోధనుడు, భీముడి కాళ్ళూ, చేతులూ గట్టిగా తీగెలతో బంధించి, గంగలోని లోతైన మడుగులో అతన్ని పారేశాడు. ఇవేవీ భీముడికి తెలియదు. అతను తిన్నగా పాతాళలోకానికి దిగిపోయాడు.

అక్కడ అతన్ని విషపుపాములు కాటు వేశాయి. వాటి విషంతో దుర్యోధనుడు పెట్టిన విషం విరిగిపోయి, భీముడికి స్పృహ వచ్చింది. తన చేతులూ, కాళ్ళూ కట్టివేసి ఉన్నట్టు తెలుసుకుని అతను గట్టిగా ఒళ్ళు విరుచుకుని, బంధాలన్నిటినీ తెంపేసి, తనను కరిచే పాములను పట్టుకుని చంపనారంభించాడు.

ఈ సంగతి వాసుకికి తెలిసింది. వాసుకి వచ్చి, భీముణ్ణి చూసి, అతను తన బంధువేనని గ్రహించాడు. ఎందుకంటే, కుంతి తండ్రి అయిన శూరుడు వాసుకి చెల్లెలి కొడుకు. అందుచేత వాసుకి భీముణ్ణి తీసుకుపోయి, వెయ్యి ఏనుగుల బలాన్ని ఇవ్వగల రసాన్ని తాగించాడు. భీముడు ఆ రసాన్ని ఎనిమిది కుండలు తాగి, సుఖంగా నిద్రపోయాడు.





# గాంధీ కథ

## 6

"వద్దు, బాబో!" అని తెల్లవాళ్లు అంటూంటే భారతీయులు దక్షిణాఫ్రికాకు వలసపోయి తమ కంఠం మీద కూర్చున్నారని కొందరు శ్వేతముఖులు చేసిన ఆరోపణ శుద్ధ అబద్ధం. తెల్లవాళ్ళు దక్షిణాఫ్రికాను వలస చేసుకున్నప్పుడు అక్కడ కాఫీ, టీ, చెరుకు పండించటానికి అనువైన సారవంత క్షేత్రాలు విస్తృతంగా వారికి లభించాయి. కాని చేసే వాళ్ళు లేరు. బానిసవిధానం రద్దయాక నీగ్రోలు పనిచెయ్య నిరాకరించారు. అప్పుడు నేటాలులోని తెల్లవాళ్ళు ఇండియా నుంచి కూలిజనాన్ని పంపమని ఇక్కడి ప్రభుత్వాన్ని కోరారు. వాళ్ళ మనుషులు మద్రాసు, బెంగాలు పరగణాలు పర్యటించి, కూలీలకు అరచేతిలో స్వర్గం చూపించి పట్టుకుపోయారు. 1890 నాటికి నేటాలులో 40,000 మంది భారతీయులు తెల్లవాళ్ళ కింద పని చేస్తూ వచ్చారు. వారి స్థితి వెట్టి వాళ్ళ స్థితి. యజమాని దుర్మార్గుడైతే మరో యజమాని కింద పని చేసే అవకాశం లేదు. అనేక ప్రతిబంధకాలు. వారిలో చాలా మంది తమ కంట్రాక్టు ముగిశాక నేటాలు లోనే స్థిరపడి, కొద్దిపాటి భూములు కొని కూరానారా పండించుకుంటూ, పిల్లలను చదివించుకుని, సుఖంగా బతకసాగారు. ఇది చూసి తెల్లవాళ్ళకు కన్నుకుట్టింది. భారతీయుడైనవాడు నేటాలులో ఉండదలిస్తే బానిసగానే ఉండాలి గాని, స్వతంత్ర పౌరుడుగా ఉండరాదని వాళ్ళ ఉద్దేశం.

1893లో నేటాలులో బాధ్యతాయుత ప్రభుత్వం ఏర్పడింది. వెంటనే తెల్లవాళ్ళు భారతీయులను నేటాలు నుంచి వెళ్ళగొట్టే యత్నాలు ప్రారంభించారు; నేటాలు నుంచి వెళ్ళిపోని భారతీయుల పైన పోల్‌టాక్స్



అని అక్కడి రాజకీయవాదులు బాహాటం గానే అన్నారు.

భారతీయులకు పౌరహక్కులు లేకుండా చేస్తూ నేటాలు శాసనసభ పాసు చేసి, గవర్నరు అమోదించిన బిల్లును ఇంగ్లండు లోని కలోనియల్ ఆఫీసు, గాంధీ సాగించిన ప్రచారం ఫలితంగా, తోసి పుచ్చింది. అయితే నేటాలు పాలకులు ఆ బిల్లును సవరణ చేసి అందులో జాతివిద్వేషం బాహాటంగా కనబడకుండా చేశారు. భారతీయులు స్వేచ్ఛగా వర్తకం చేసుకునే అవకాశాలు దాదాపుపోయాయి.

చట్టం ద్వారా తెచ్చిన అడ్డంకులు అలా ఉండగా, భారతీయులు నిత్యమూ భరించే అవమానాలు మితిమించి పోయాయి. ఏ పని చేసుకునే భారతీయుడైనా "కూలీ"యే-కూలీ బడిపంతులు, కూలీ దుకాణదారు! గాంధీ "కూలీ బారిస్టరు." భారతీయులు "హీనులు, అనాగరిక జాతి వాళ్లు". వాళ్లు రోడ్లవార నడవరాదు. రాత్రి పూట బయటికి రారాదు. రైలుపెట్టెలో తెల్లవాడు అభ్యంతరం చెబితే భారతీయుణ్ణి బయటికి గెంటటమే. తెల్లవాళ్ళ హొటళ్ళ లోకి వాళ్లు పోరాదు. చిత్ర మేమిటంటే, ఈ భారతీయులు నిష్క్రమించితే

సూచించారు. ఈ భారతీయులు మొదట్లో కూలీలుగా చేరిన నిరక్షరులు. వారి మీద విధిస్తామన్న పన్ను అయిదారు మాసాల కూలికి సమానం.

నేటాలు చేరిన భారతీయులలో వర్తకులు కూడా ఉన్నారు. వీళ్ళు తెల్లవర్తకు లంత అమర్యాదస్తులూ, దురాశాపరులూ కానందున, భారతీయులూ, నీగ్రోలూ వీరి వర్తకాన్ని ప్రోత్సహించారు. ఇది కూడా తెల్ల వర్తకులకు కంటకింపయింది. నేటాలు ప్రభుత్వం హరించ దలచినది వీరి పౌర హక్కులే. "భారతీయుడికి దక్షిణాఫ్రికా భవిష్యత్తులో భాగం అనేది ఉండరాదు,"

నేటాలులో తెల్లవాళ్ళ జీవితం స్తంభించి పోతుంది! (ఈ మాట "కేప్ టైమ్స్" పత్రికే అన్నది.)

గాంధీ నేటాల్‌లో స్థిరపడినట్టే అయింది. ఆయన 1896 లో స్వదేశానికి వచ్చి, తన కుటుంబాన్ని తీసుకుపోయాడు. ఆయన ఇండియాలో ఉన్న కొద్ది కాలంలో దక్షిణాఫ్రికా భారతీయుల తరఫున మంచి ప్రచారం చేశాడు. ఆయన బొంబాయిలో ఫిరోజ్ షా మెహతానూ, పూనాలో గోఖలేనూ, తిలక్‌నూ కలుసుకున్నాడు. హిందూ, పయొనీర్, స్టేట్స్‌మన్, ఇంగ్లిష్‌మన్ లాటి పత్రికలు గాంధీ కోరిన ప్రచారం చేశాయి. బొంబాయి, పూనాలలో మీటింగులు జరిగాయి. కలకత్తాలో మీటింగు జరగనుండగా గాంధీ నేటాలు తిరిగి పోవలసి వచ్చింది.

ఇండియాలో గాంధీ చేసిన ప్రయత్నాలను గురించి నేటాలులో పుకార్లు వ్యాపించి, అక్కడి తెల్లవారికి ఆగ్రహం తెప్పించాయి. గాంధీ కుటుంబం వచ్చిన ఓడతోబాటు మరొక ఓడ కూడా వచ్చింది. అందులో 400 మంది భారతీయు లున్నారు. గాంధీయే వారిని తీసుకొస్తున్నాడనీ, నేటాలును భారతీయుల మయం చేయ బూను



కున్నాడనీ తెల్లవాళ్ళు అనుమానించి, ఆ భారతీయులను వెనక్కు తిప్పి పంపటానికి విశ్వప్రయత్నాలు చేశారు. వాళ్ళు ఆ రెండు ఓడలనూ రేవులోకి రాకుండా 23 రోజులపాటు క్వారంటైన్‌లో ఉంచారు. మిగిలినవారంతా ఓడ దిగి పోయినాక కూడా గాంధీని వాళ్ళు దిగనివ్వలేదు. కాని గాంధీ మిత్రుడైన తెల్ల లాయరు ఒకడు అడ్డు పడి గాంధీకుటుంబాన్ని ఓడ దింపాడు. ఓడ దిగి వచ్చే గాంధీ చుట్టూ ఒక పెద్ద గుంపు పోగై, అతనిపై రాళ్ళూ, కుళ్ళిపోయిన గుడ్లూ విసరసాగారు. గాంధీ ప్రాణాలతో ఇల్లు చేరుతా ననుకోలేదు.

అంతలోనే ఒక పోలీసు అధికారి భార్య, మిసెస్ అలెగ్జాండర్ అనే ఆమె, గాంధీని గుర్తించి, తన గొడుగు ఎత్తి గాంధీకి పట్టుకుని, అతని వెంట నడవసాగింది. తరవాత కొందరు పోలీసులు కూడా వచ్చి గాంధీకి రక్షణ కలిగించారు.

గాంధీ ఈ రోజు తగిలిన గాయాల నుంచి పూర్తిగా కోలుకునే లోపలనే కొందరు తెల్లవాళ్ళు గాంధీ ఉన్న ఇంటిని ముట్టడించి, అతను తమ వశం కాకపోతే ఇంటికి నిప్పు పెట్టి, లోపల ఉన్న అందరినీ బూడిద చేస్తామని బెదిరించారు. అప్పుడు పోలీసు అధికారి అలెగ్జాండరే గాంధీకి తోడ్పడ్డాడు. ఆయన బయట నిలబడి అక్కడ చేరిన మూకను కబుర్లలో పెట్టి, గాంధీ మారువేషంలో ఇంట్లో నుంచి బయటికి వెళ్ళే ఏర్పాటు చేశాడు. గాంధీ భారతీయ పోలీసు దుస్తులు ధరించి, భారతీయ వర్తకుడి వేషం వేసుకున్న ఒక డిటెక్టివును వెంటబెట్టుకుని, గుంపు మధ్యగా బయటికి వెళ్ళి, పోలీసు స్టేషను చేరుకున్నాడు. అక్కడ ఎంతో కాలం తల దాచుకోవలసిన పనిలేకుండా నిజం బయట పడింది. పత్రికలవాళ్ళు ఆయనతో మాట్లాడి, ఆయన ఇండియాలో వాస్తవంగా చేసిన ప్రయత్నా లేమిటో తెలుసుకున్నారు.

"మిస్టర్ గాంధీ చర్యలలో అసంగతమైన దేమీ లేదు. నేటాలు పరిస్థితులను గురించి ఆయన చేసిన ప్రచారం ఆయన దృక్పథం నుంచి సమర్థనీయమైనదే," అని ఒక నేటాలు పత్రిక రాసింది.

గాంధీపై చెయ్యిచేసుకున్న వారిని అరెస్టు చేయవలసిందని లండనులోని వలసమంత్రి నేటాలు ప్రభుత్వానికి కేబుల్ పంపాడు. గాంధీ ఇందుకు ఒప్పుకోలేదు. అసలైన ప్రేరేపకులు ప్రభుత్వంలోనే ఉండగా, ఉద్రేకపూరితులైన యువకులు దౌర్జన్యం చేశారని శిక్షించి ఏమి ప్రయోజనమని ఆయన అన్నాడు.



# 93. "వర్ణమాల భూగోళం"

ప్రపంచంలోని భూగోళా లన్నిటిలోకీ పెద్దది. ఇది అమెరికాలోని క్రిస్టియన్ సైన్స్ పబ్లిషింగ్ హౌస్‌లో ఉన్నది. ఈ గోళాన్ని తయారు చెయ్యటానికి 608 రంగు రంగుల గాజు పలకలు ఉపయోగించారు. దీనిని 95 అడుగుల కైవారంగల కంచుచట్రంలో అమర్చారు. భూమధ్యరేఖ వెంబడి కంచుగడియారాలు అమర్చి ఏ దేశంలోని గడియారం ఎంత సూచించేదీ తెలియచేస్తారు. అయితే ఈ భూగోళంలోని సరిహద్దులు 1935 నాటివి. (అందుకే పాకిస్తాను ఇండియా నుంచి వేరుగా చూపిలేదు.)



Photo by S. B. Takalkar



బహుమతి
పొందిన వ్యాఖ్య

చూడ ముచ్చట!

పంపినవారు:
కె. ఎస్. విమల, గుంటూరు

Photo by D. N. Shirke



బహుమతి
పొందిన వ్యాఖ్య

గూడు ఎచ్చట?

పంపినవారు:
కె. ఎస్. విమల, గుంటూరు

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 20 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1969 అక్టోబర్ నెల సంచికలో ప్రకటించబడును





★ పై ఫోటోలకు సరి ఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ అగస్టు నెల 20-వ తేదిలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 20/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26.

## అగస్టు నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: చూడ ముచ్చట!

రెండవ ఫోటో: గూడు ఎచ్చట?

పంపినవారు: కె. ఎస్. విమల,

ఓల్డ్ పట్టాభిపురం, గుంటూరు.

బహుమతి మొత్తం రు. 20/—ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road. Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'

# 'నన్ను కాలేజీ క్రికెట్ జట్టుకు కేప్టెన్‌గా ఎంచుకొన్నారు!'



కాని, కొన్ని నెల్లంతు ముందు నాకు ఎల్లప్పుడూ నీరసంగా వుండేది. అందువలన నన్ను క్రికెట్ జట్టులో చేర్చుకోలేదు. ఒక డాక్టర్ని చూదాను.

డాక్టరు ఇలా అన్నారు: "నీకు చదువుకు, ఆటకు కావలసిన అదనపు శక్తి కోసం రోజూ హార్లిక్స్ త్రాగు."



హార్లిక్స్ అద్భుతంగా పనిచేసింది. నా ఓపిక, ఉత్సాహములను చూచి నన్ను క్రికెట్ జట్టుకు కేప్టెన్ గా ఎంచు కొన్నారు!



## హార్లిక్స్ సహాయముతో ప్రగతి చెందాను!

చురుకుగా వుండే యువతి యువకులకు వాళ్ల వినియోగ,పరిచే శక్తిని యిచ్చుటలో హార్లిక్స్ సహాయపడుతుంది. హార్లిక్స్ నీరసత్వాన్ని పోగొట్టి మిమ్మలిని మంచి ఆరోగ్యముతో వుంచుతుంది. చిన్న వారికీ పెద్ద వారికీ హార్లిక్స్ శ్రేష్ఠమైన ఆహారము. రోజూ హార్లిక్స్ త్రాగండి!




పూర్తి మీగడ గల పాలతో గోధుమ పిండి మరియు మాల్టెడ్ బార్లీల పోషకవంతమైన సారముల చేర్చి తయారు చేయబడినది

# హార్లిక్స్ అదనపు శక్తిని కలిగించును!

# కొంగ-నక్క

(నీతికథ మరోసారి)

రాజు అడవిలో నివసించే జిత్తులమారి నక్కకు తనతో అడవిలో నివసించే వారిని వేళాకోళం చేయుటమంటే ఇష్టము. ఒక నాడు... 1

అమాయకమైన కొంగ శంకర్‌ని విందుకు పిలిచి పల్చటి పళ్ళెంలో వడ్డించింది


2



3

వెంటనే శంకర్ రాజుని విందుకు పిలిచి... 4

...ఆశగొల్పించే బ్రూక్ బాండ్ A-1 డస్ట్ తేనీటిని ఇచ్చింది... నిడుపాటి మెడగల కూజాలలో!



5

రాజుకు బాగా తెలిసింది పాఠము



6




రాజుకి అహంకారం తగ్గింది—అందరికీ సమానంగా రుచికరమైన A.1 డస్ట్ టీతో విందు చేస్తున్నాడు. 7

BB 5221

## తప్పక చూడండి!

యస్.వి.యస్ ఫిలిమ్స్

# నిండు హృదయాలు

నిర్మాత: యం.జగన్నాధరావు

దర్శకత్వం: కె.విశ్వనాధ్ B.Sc.,

ఆంధ్ర: జోలీ, నైజాం: ఉషా
సీడెడ్: నవభారత్, మైసూర్: సుధా చిత్ర



# AWARDS!

# WON PLENTY

YET WE DON'T SAY
WE ARE THE BEST

ONLY
WE DO OUR BEST

**PRASAD PROCESS PRIVATE LTD**
CHANDAMAMA BUILDINGS MADRAS-26

